శ్రీః

# శ్రీరామావతారతత్త్వము

## ఏడవ ప్రకరణము.



ఇయ్యది

కడప మునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితుఁడగు

కావ్య స్మృతి తీర్థః

జనమంచి శేషాద్రిశర్మ విరచితము.



చెన్నపురి:

శ్రీ 'రామ' ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1934.

శ్రీః

# శుభోదంతము



తత్త్వజిజ్ఞాసువులారా!

శ్రీరామాయణాంతరతత్త్వమున సప్తమప్రకరణము కరుణాసముద్రుఁడగు భగవంతుని యనుగ్రహాతిరేకమునఁ బూర్తి చేసి యిదిగో మీకు సమర్పించితి. ఈప్రకరణమున నారణ్యకాండమునఁ గల శేషభాగము పూర్తిగఁ గలదు. ఇందు సీతాహరణమునకు రావణుఁడు వెడలుట, మారీచుని హితము, మాయామృగము వెంట రాముఁడరుగుట, లక్ష్మణుని రాముకడ కరుగుమని సీత పురికొల్పుట, రావణాగమనము, సీతారావణసంవాదము, సీతాపహరణము, జటాయువధము, శ్రీరాముఁడు జటాయువునకుబంధువులను సంస్కారములు చేయుట, శబరికి మోక్షమిచ్చుట లోనగువిషయములు గలవు. ప్రతివిషయము శ్రీసీతారాముల మహత్త్వమును దేటపఱచును. లోకానుగ్రహార్థము వారెట్లు ప్రవర్తించిరను విషయము స్పష్టముగా నిందుఁ గలదు. ఆయాయిభాగములయందు నావ్రాసిన విశేషములను బండితులు పరిశీలించి నన్ను ధన్యునిజేయవలసియున్నది. నిష్పక్షపాతబుద్ధిచేఁ బరిశీలించినయెడల నావ్రాసిన భావములు సమంజసములే యని మహాత్ములకుఁ దోఁచునని నాదృఢవిశ్వాసము.

ఈయేడుప్రకరణములచే శ్రీమద్రామాయణమున మూఁడు కాండములు పూర్తిచేయఁబడినవి. తక్కుంగల నాల్గుకాండము లెనిమిదిప్రకరణములచేఁ బూర్తిచేయఁగల ననుకొనుచున్నాఁడను. భగవత్కారుణ్యము మహాశయుల

తోడుపాటు వలసియుండును. పోషకులకు [illegible] యీగ్రంథమే తమకుఁ దెలుపును. కాల[illegible] కాఁ బోలు పెక్కండ్రు తోడ్పాటు చూపలేదు. [illegible] యనుగ్రహమున సాధువుల తోడుపాటు [illegible] యున్నాఁడను. నాలుగుభాగముల [illegible] గ్రంథమును బ్రకటించుటకు నవకాశము చాలకున్నది. అట్టి [illegible] కూడ నాకింతదనుక లేదు. భగవత్కృపయే యుదని [illegible] డను. పలువురు మహాశయులు చేయూఁత యొసంగి [illegible] రింతురుగాక యని కోరుచున్నాఁడను.

"నిందతు నందతు వాసన్నసూయురనసూయురత్ర కిం తేన,
యత్స్నానసగమనాయై వేదం మమ తు పాథేయమ్."

అన్నసూక్తి నాకు శరణ్యము. ఇంతకం[illegible] [illegible] వ్రాయఁదగిన విషయము లిందు లేవు. [illegible] స్వహానమే భూషణముగఁ గలవారు కదా. అట్టి[illegible] నాలోప ములం బరిశీలించి నాకుఁ దెలిపి నాచేతనే [illegible] యత్యుత్తమకార్యము. "కిం వా ప్రార్థనయా [illegible] స్వాభావిక స్తద్గుణః" అన్నసూక్తి క్రొత్తది కాదుగదా. ప్రమాదములు క్షంతవ్యములని మహాత్ముల వేఁడనేల? స[illegible]లమున నాలోపములఁ బాటింపక ముద్రించి యిప్పించిన భాషోద్ధారకులు, పరోపకారపారీణులు నగు మ-రా-రా-శ్రీ, వావిళ్ల వేంక టేశ్వరశాస్త్రులుగారి కేతన్ముఖమున నాకృతజ్ఞతా[illegible]నము లర్పించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించువిద్వద్విధేయుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ,
శ్రీ. శ్రీ. శ్రీ.

# ఉద్ధారకులు

దివాన్ బహాదర్: బి. మునుస్వామినాయుడుగారు, బి.ఏ.,బి.యల్., చిత్తూరు.

మ-రా-శ్రీ, నుడిపల్లి సూర్యనారాయణమూర్తిగారు, అరవిల్లి, ప॥ గోదావరి.

,, అయ్యగారి బుస్సెట్టిగారు, కటేకల్లు, బళ్లారి.

---

# పోషకులు

మ-రా-శ్రీ, [illegible]ప్రెగడ లక్ష్మీనారాయణరావుగారు,
బి. ఏ., బి. ఇ., ఇంజనీయర్ గారు, బళ్లారి.

,, దేవిరాజు రామరావుగారు, గుంటూరు.

,, ఏ. టి. వి. ఆర్. నరసింహస్వామిగారు, ఉపాధ్యాయులు,
వాడపల్లి, ప॥ గోదావరి.

,, కలగ నరసింహముగారు, ఉపాధ్యాయులు, దొమ్మేరు.

,, నరసింహదేవర వెంకటశాస్త్రులుగారు ,,

,, పైడా రామకృష్ణయ్యగారు, జమీందారులు, కాకినాడ.

,, బొమ్మిసెట్టి లక్ష్మీనరసింహస్వామిగారు, నెల్లూరు.

,, వెలంపల్లి రామకృష్ణమశాస్త్రిగారు, కాకినాడ.

,, వవ్వేటి విశ్వనాథరావుగారు, బి. ఏ., బి. యల్., కాకినాడ.

,, పత్తి గురుమూర్తిశాస్త్రిగారు, కల్లూరు.

,, దరిమడుగుల చలమయ్యగారు ,,

,, కోట వెంకటరామయ్యగారు ,,

,, బచ్చు చంద్రమౌళిగారు, మునునూరువారిపాళెం.

మ-రా-శ్రీ, అల్లాడి జగన్నాథశాస్త్రులుగారు, బి.ఏ.,ఎల్.టి., హెడ్మాష్టర్, వి. ఆర్. హైస్కూల్, వేంకటగిరి టౌన్.
,, జంగా లక్ష్మీనరసింహశాస్త్రులుగారు, ఉపాధ్యాయులు, కడప.
,, పత్తి రాఘవులుశ్రేష్ఠిగారు ,,
,, గార్లదిన్నె రామేశ్వరరావుగారు,బి.ఏ.,బి.యల్., అడ్వకేటు, కడప.
,, బత్తులపల్లె శేషగిరిరావుగారు, రామరాజుపల్లె, కడప.
,, కాట్రపాటి చలపతిరావుగారు, కడప.
,, సముఖము శ్రీనివాసులునాయుడుగారు, ఇంగ్లీషు హెడ్ అకౌంటెంటు.
,, దేవరకొండ సుబ్రహ్మణ్యముగారు, పాటూరు.
,, పుట్టముకెడ్డి చలమారెడ్డిగారు, పంచాయతిప్రెసిడెంటు, మండపనుఃపల్లె.
,, ఆకేపాటి తిరుమలరెడ్డిగారు, గ్రామమునిసిఫ్.
,, పురిగండ్ల చెంగయ్యగారు, నాజర్, నెందలూరు.
,, యీదాళ్ల బాలసుబ్బయ్యశ్రేష్ఠిగారు, బెడుసుపల్లి.
,, నిట్టూరు లక్ష్మీనారాయణరావుగారు. బి.ఏ., ప్లీడర్, గుత్తి.
,, సిద్ధవరము వేంకటసుబ్బయ్యగారు, బి. ఏ., ప్లీడర్ ,, [గుత్తి.
,, వి॥ కొప్రేశాచార్యులుగారు, బి. ఏ. బి. ఇ.డి. ఉపాధ్యాయులు,
,, ఆర్కాటు వెంకోబరావుగారు, పెన్షనర్ ,,
,, కాన్గోవి నరసింగరావుగారు, పెన్షనర్ ఉపాధ్యాయులు,గుత్తి.
,, ఉప్పర్లపల్లె రంగాచార్యులుగారు, తెలుఁగుపండితులు, హైస్కూల్, గుత్తి.
,, వై॥ కొండల్.రావుగారు, ఉపాధ్యాయులు ,,
,, ఓ. ఐ. శౌరిరెడ్డిగారు, ఎమ్. ఏ., బి.యల్., వకీలు, గుత్తి.

మ-రా-శ్రీ, కే. వేంకటరావుగారు, అనుంపల్లె.
,, జంబులపాటి పెద్దవేంకటప్పగారు, ధర్మపురి, గుత్తితాలూకా.
,, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు, గాండ్లపాడు.
,, రాచర్ల తిప్పయ్యగుప్తగారు, బెళగుప్ప.
,, కరణము కృష్ణరావుగారు, జేవినహాళ్లి, అనంతపురంజిల్లా.
,, బి. రంగాచార్యులుగారు, కిరికెర ,,
,, కే. లింగప్పగారు, కిరికెర ,,
,, గాదంసెట్టి సుబ్బయ్యశ్రేష్ఠిగారు, కిరికెర, అనంతపురంజిల్లా.
,, కట్టా ఆత్మారామయ్యశ్రేష్ఠిగారు, హిందూపురము.
,, కట్టా మాధవయ్యగారి నారప్పశ్రేష్ఠిగారు ,,
,, మాకము సీనయ్యగారి నారాయణయ్యశ్రేష్ఠిగారు,,
,, కంబము శ్రీనివాసరావుగారు, రిటైర్డు హుజూర్ ట్రెజరర్, బుక్కరాయసముద్రము.
,, యాదాటి తిమ్మయ్యగారు, అనంతపురము.
,, కే. యస్. రామానుజాచార్యులుగారు, బి.ఏ., బి. యల్., వకీలు, అనంతపురము.
,, మాసేపల్లి నారాయణరావుగారు, వకీలు, అనంతపురము.
,, శ్రీకంఠము సుబ్బయ్యగారు, ఆంధ్రవిశ్వకళాపరిషత్సభ్యులు, అనంతపురము.
,, అంగదహాళ్లి కృష్ణమూర్తిరావుగారు, వకీలుగుమస్తా, ,,
,, విట్టా శేషప్పశ్రేష్ఠిగారు, బళ్లారి.
,, రావుసాహేబు జే. పాపయ్య శ్రేష్ఠిగారు ,,
,, పిల్లారిసెట్టి రంగబ్రహ్మానాయుడుగారు, బి. ఏ., తహసీల్దారు, బళ్లారి.

మ-రా-శ్రీ, చెరుకూరు భీమప్పగారు, బళ్లారి.

,, శ్రీమతి వై. ఛాయాంబగారు ,,

,, జిడ్డు లింగయ్యగారు, బి. ఏ., బి. యల్., అడిషనల్ మునిసిఫ్, గుంటూరు.

,, పర్వతము రాజేశ్వరరావుపంతులుగారు, బెజవాడ.

,, పుల్లెల వేంకటరమణయ్యగారు, ఇచ్ఛాపురము.

,, కట్టా జోగయ్యగారు, మదరాసు.

,, దోగుపర్తి వేంకటసుబ్బారావుగారు, మదరాసు.

,, ధాకరాజు వేంకట రమణరావుగారు, చిన్నతిప్పసముద్రము.

# విషయసూచిక.

# ప్రకటనము.

ఆర్యులారా!

శ్రీరామావతారతత్త్వమునకుఁ దోడుపడఁ గోరువార లీనిబంధనములఁ బాటింపవలయును.

25 రూప్యముల నొసంగువారు రాజపోషకు లనఁబడుదురు. వారల కిద్దాని ప్రకరణముల నన్నింటిని దారికర్చులు భరించి పంపఁబడును.

10 రూ॥ ఒక్కసారి యొసంగువారు పోషకు లనఁబడుదురు ఒక్కొక్క ప్రకరణ మొక్కరూప్యమువంతున వారి కర్చులు భరించి వారికిఁ బంపఁబడును. ఈ రెండు తెగలమహాశయుల పవిత్రనామధేయము లిందుఁ బ్రకటింపఁబడుచుండును.

1 రూప్యము ముందుగాఁ బంపువారు చందాదారు లనఁబడుదురు. వారికిఁ బ్రతిప్రకరణము వీ. పీ. 1-4-0 లకు పంపఁబడును.

చందాదారులు కాని వారలకుఁ బ్రకరణ మొక్కొక్కటి 1-4-0 లకు నీఁబడును.

---

# ఇతర గ్రంథములు

సూచనము.

| | | |
|---|---|---|
| శ్రీకృష్ణావతారతత్త్వము, 12 సంపుటములు. ఒక్కొక్కటి | 1 | 8 |
| 12 సంపుటములు ఒక్కసారి కొనినవారలకు ... | 16 | 0 |

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| భగవద్గీత, వచనము, మూలముతోఁటి | ... | 1 | 0 |
| ఉత్తమమార్గము, భక్తిరసము | ... | 0 | 10 |

## పద్యములు.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్ర శ్రీమద్రామాయణము, నిర్వచనము, 3 సంపుటములు | ... | 12 | 0 |
| 7 ,, | ... | 14 | 0 |
| ఆంధ్ర బ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| తెలుఁగు బ్రహ్మపురాణము | ... | 4 | 0 |
| ఆంధ్ర లలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| హనుమద్విజయము | ... | 0 | 8 |

తాండవకృష్ణభాగవతము, దశమస్కంధమున కు తెలుఁగు. మూలము వదలకుండఁ దెనిఁగింపఁబడినది. అయిదు వేల రెండువందల పద్యములు గలవు. 31-3-1935 లోపల 3-8-0 రు. పంపువారలకు కర్చులు భరించి పోస్టుద్వారా పంపఁబడును.

జనమంచి శేషాద్రిశర్మ,
కడప.

**మూలాదిషట్సరసిజాంతసహస్రపద్మ**
**పత్రాంతరాళనిలయం భవబంధనాశం,**
**నాదాంతచంద్రగళితామృతసిక్తరూపం**
**నాదాంతనాదమహిమాస్పద రామమీడే.** ౫

(శ్రీరామకర్ణామృతము.)

పరతత్త్వజిజ్ఞాసువులారా! సన్మతాభిమానభూషణులారా!

శ్రీరామావతారతత్త్వమున నాలవ ప్రకరణమును బఠించితిరికదా. అందలి విశేషముల నెఱింగియుందురు. శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులంగూడి దండకారణ్యము బ్రవేశించి తనరాకకై వేచియుండు విరాధునకు శాపమోక్షమును బ్రసాదించి, శరభంగాది మహర్షులం గృతకృత్యులనుగ నొనరించుచు రాక్షసాధములం బొలియింప శపథంబుఁ బూనుటయును, జానకీదేవి తదాశయమును బాహ్యులకు వెల్లడింపఁబూని భర్తను బ్రశ్నించుటయు నా ప్రశ్నమునకు శ్రీరామమూర్తి బదులు చెప్పుటయుఁ ద్రోవయందుఁ గలమునులయాశ్రమములం దిలకించుచు నందందు నిలుచుచు మునులశ్రమములం గాంచుచుఁ బరితపించుచు వానిని దొలఁగింపఁబూని పంచవటిం జేరుట యనునంతదనుకఁ గలవిశేషముల నెఱింగియేయుందురు. ధర్మరక్షణార్థము శ్రీరామమూర్తి యెట్టి పట్టుదలం బూనెనో యీ భాగమును బఠించినపుడు తెల్లమయ్యెనుగదా. సౌమిత్రి కైకను భరతుని నించుక నిందింపఁగా దాశరథి యొసంగిన యుపదేశముంబట్టి తదాశయ మెట్టిదని మీరు గుర్తించియే యుందురు. సౌభ్రాతృత్వమన నెట్లుండవలయునో మీకుఁ దెల్లమయియే యుండును. ఈభాగమునఁ గలకథలం బఠించునపుడు

మీఁగుల్లముల కనేక విశేషములు పొడకట్టియుండుననుట నిస్సంశయము. ఆ మాయిత్రావుల నే వ్రాసిన విశేషార్థములను మీఁరు పరిశీలించియే యుందురని నావిశ్వాసము. 'పని లేని మంగలి పిల్లితల గొఱిగె'నన్నట్లు మతాభిమానమున భగవన్నామముల దూషించుట హితముగాదను సద్భావము మీఁకుఁ బొడకట్టియుండును. "ఏకో దేవః కేశవో వా శివో వా" యన్న ప్రాచీనాభియుక్తోక్తి మీఁకుఁ గ్రొత్తది కాదుకదా. దీనిభావమేమి? శివకేశవులందప్పఁ దక్కిన భగవదంశముల నారాధింపఁగూడదనియా? కాదుకాదు. ఇందలి శివకేశవశబ్దములు తత్తదుపాస్యదేవతోపలక్షణములు. ఉపలక్షణవిధియే యిందు గ్రహింపఁదగినది. "కాకేభ్యో దధి రక్ష్యతామ్" అను తావునఁగల కాకశబ్ద మేలాగున దధివినాశకసర్వజంతూపలక్షణమో యట్లే యీ వాక్యమునఁగల శివకేశవనామములు వారివారి యుపాస్యానేకదేవతాబోధకములు. అనఁగా లోకమునఁగల జనులందఱు శివునినో కేశవునినో తప్ప నితరదైవముల నారాధింపరాదని దీనిభావము కాదనియు, నేదేవత నెవ్వఁ డారాధించినను దానినే భగవత్స్వరూపముగా సంభావించి తద్భిన్న మేదియు లేదనియు, నానామమున నారూపమున నా సర్వేశ్వరుఁడు వెలసెనని యూహింపవలయుననియు దీని సారము.

"యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున,
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్. ౩౯. అ-౧౦.
సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. ౩౧
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః." ౬ అ. ౩౨.

అను నీ భగవద్గీతావాక్యములు.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా."

అనుప్రాక్తనసూక్తియు నీపై నవ్రాసిన యాశయముననే బోధించును. దీనిచే నేభక్తుం డేరూపమున నేనామమున నారాధించినను నాభగవంతుఁడు ప్రీతుఁ డగునని తేటపడును. ఇట్లు భగవదుపదేశవాక్యము లుండఁగా నీకాలపువారు కొందరు కొకరు నేవకులనియు, నొక్కఁ డుత్తముఁడు, ఒక్కఁ డేదేవుఁ డనను భావముగలవార లెట్టి కుమతులో సులభముగా నూహింపవచ్చును. అట్టిభావము వారి యల్పత్వమునే వెల్లడించును. అట్టి కుటుంభరులు యోగివేషధారులై నాటకముల సూత్రధారులై బహువిధముల ధనార్జనము చేయఁబూనిన వారలే యనియు, వారి యుపదేశములను బాటింపరాదనియు స్పష్టముగా నమ్మవలయును. మఱియుఁ బై భగవద్వాక్యములు వేఱొకవిషయమునుగూడ మనకుఁ దేటపఱచుచున్నవి. ఒక్క దేవతనే నమ్మవలయు ననఁగా భావ మేమి? బహుత్వము మనికి రాదనియు, నేకత్వమునే కాంచవలయుననియే కదా. దానఁ గలుగఁగల లాభమేది? సమదర్శనత్వమే. తాను నమ్మిన దేవతారూపము కానిది ప్రపంచమున నేదియు లేదనుట సమదర్శ

## సగుణనిర్గుణోపాసకులు.

ఎవ్వారు సగుణోపాసనమున కర్హులు? ఎవ్వరు నిర్గుణోపాసనమున కర్హులు? అను విషయ మీ సందర్భమున విచారింపవలసి యున్నది. పెంచివ్రాయక సారతమవిషయము నే వ్రాసెదను. ఎట్టివారు సమదర్శిత్వమున కనర్హులో వారు సగుణోపాసనమునకే యర్హులు. అనఁగా విగ్రహారాధనమున కర్హులని కాదు. ఒక్కరూపమును భగవంతునకుం గల్పించి దానినే మనస్సున నిలిపి ధ్యానింపవలసినవారు. అది మంచిది కాదను విశ్వాసము గలవారలనఁగా సర్వమును భగవన్మయముగా భావించుచు నట్లే కాంచుచుఁ దద్భిన్నమే లేదని యెఱుంగుచు నుండువారు సగుణధ్యానమును మాని నిర్గుణోపాసన మొనరింపఁదగినవారు. వారలే యోగులు. వారికంటె నధికులు లేరని భగవంతుఁడు నిర్ణయించెను.

> "తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
> కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున."

అనికదా గీతావాక్యము. ఇందు జ్ఞాని యనఁగా శాస్త్రపాండిత్యము కలవాఁడనియే యర్థము. లేకున్న యోగి జ్ఞాని కాఁడనియో, జ్ఞాని యోగి కాఁడనియో యర్థ మేర్పడును. శాస్త్రజన్యజ్ఞానము కలవారికంటె దాని నాచరణమున నుపయోగించి తదానందానుభూతి కలవాఁ డుత్తముఁడని భావము. వాఁడే యోగి యనంబడును. తపస్సు యజ్ఞాదికర్మము ననునవి సగుణోపాసనములే. యోగి నిర్గుణోపాసకుఁడు. కనుకనే యుత్తమోత్తముఁడు యోగియని భగవంతుఁడు తెలిపెను.

**"యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః,**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః."** ౧౦. అధ్యా-౬.

అని యోగి లక్షణములను భగవంతుఁడు తేటపఱచెను. నిర్గుణోపాసకుఁడే యోగి యనియు, వైరాగ్యసంపద గలవాఁడతఁడే యనియు దీనిసారము. ఆచరణమునఁ బెట్టని శాస్త్రజన్యజ్ఞానము తరింపఁజేయఁజాలదని మన మెఱుంగవలయు. అది లేని యోగికంటె నయ్యదియుఁ గలిగి పామరజనోద్ధరణసమర్థుఁ డగుయోగి యుత్తముఁడే యగునని మన మెఱుంగవలయును. సగుణనిర్గుణములఁ గలిపి యుపాసించువాఁడు "రెంటికిం జెడినరేవణ నాదునె సీరజేక్షణా" యన్న సూక్తి కుదాహరణ మగును. ఇం దన్యోన్యాశ్రయదోషము రాదా యని కొందఱు ప్రశ్నింతురు. కలదనియే యంగీకరింతము. తన్నివృత్తి యెట్లను ప్రశ్నమును విమర్శింతము. సగుణోపాసనము ఫలాభిసంధిరహితము కాఁగా విజ్ఞానము తనంతన యుదయించి వికసించును. కేవలశాస్త్రపఠనము చాలదు. రెండును గలిసిన మఱింతమంచిదే. విజ్ఞానము కర్మానుష్ఠానము లేక కుదురదు. ధనమిచ్చి కొనుదమన్న నెందును దొరకదు. ఆవిజ్ఞానము దృఢమూలమైనదా లేదా యనుటకుఁ బరీక్ష యేది? అనఁగా నెపుడు సంకల్పములు నశించునో యపుడది దృఢతం గాంచెనని మన మెఱుంగందగు. సంకల్పము లుదయించుచుండఁగా వానిని నశింపఁజేయుచుండవలయు. కొంతకాల మట్లు చేయఁగా నవి పూర్వపుణ్యావశమున నశించును. ఆస్థితియందే యాతఁడు యోగి యనంబడును. అట్టివాఁడే

సర్వోత్కృష్టుఁడని గీతావాక్యము తెలుపుచున్నది. ఇదియే సకలశాస్త్రసారతరవిషయము. దీని నెఱింగి తన శక్తి యెంత యో తెలిసికొని తా నీరెండింటిలో దేని కర్హుఁడో నిశ్చయించుకొనవలయును. ఇతరు లితఁ డిద్దాని కర్హుఁడని నిర్ణయింపఁజాలరనుట సర్వసమ్మతసిద్ధాంతము.

ఇట్టులుండఁగాఁ గేశములు పెంచిన మూర్ఖులు కొందఱు యోగులమని ధనము ప్రోగుచేయు కోరిక నెన్నియో ధర్మవ్యాజములఁ గల్పించుకొనుచుఁ బామరులను మంత్రోపదేశరూపమున వంచించి భేదబుద్ధు లనువారికిఁ గల్పించుచు నిష్టసిద్ధిని గాంచుచుఁ, జచ్చు వేదాంతవాక్యము లుపదేశించుచు, నన్యమతములను దత్కర్తలను దూషించుచుఁ దిరుగుచుందురు. వారికి నుపాసనమన్న ధనార్జనమే. వారలకు ధన మొసంగి తరింతుమని యాశించు నమాయకులు ధనము క్తిని మాత్రము గాంతురు. కాని వాస్తవ మగుము క్తిని గాంచరనుట సిద్ధాంతమే. కపటయోగులమూలమున సత్యముగా యోగము నభ్యసించి జ్ఞానధనము నార్జించినవారలకు మర్యాద యూడి పోవుచుండును. దంభధర్మములమూలమున యజ్ఞాదిసత్కర్మముల నాచరింపఁగోరి ధనవంతుల నాశ్రయించిన నించుకయు లాభము కలుగకున్నది. కావున నట్టి ధాంభికులను బహిష్కరింప నెల్లరుఁ బ్రయత్నింపవలయును. ఇట్టి కపటయోగులు లోనగువారు పూర్వకాలమునఁ గూడ నుండువారే. వారిని గుఱించియే శ్రీశంకరభగవత్పాదాచార్యులుగారి శిష్యులు తోటకాచార్యులు

"జటిలో ముండీ లుంఛితకేశః కాషాయాంబరబహుకృతవేషః,
పశ్యన్నపి చ న పశ్యతి మూఢో హ్యుదరనిమిత్తం బహుకృతవేషః."

అని తెలిపిరి. యోగులకుఁ దృష్ణకుఁ జాలదూరము. ధనముం గోరువాఁడు జ్ఞానలవహీనుఁడు.

"వళిభిర్ముఖమాక్రాంతం పలితైరంకితం శిరః,
గాత్రాణి శిథిలాయంతే తృష్ణైకా తరుణాయతే." ౧౪

అని భర్తృహరి వైరాగ్యశతకమునఁ దెల్పెను. తృష్ణాతిరేకసంపన్నుఁడు యోగి కాఁజాలఁ డనుట నిర్వివాదవిషయము.

"యదాహి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే,
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే."

అని గీతాశాస్త్రము తెలుపుచున్నది. వెండ్రుకలు పెంచినంత మాత్రమున యోగి కాఁడు. ఛాయాపటములు తీయించుకొన్నమాత్రముననుగాఁడు. సర్వసంకల్పసన్న్యాసి కావలయును. అని శ్రీకృష్ణమూర్తి యర్జునునకు బోధించినవాక్యములసారమని మన మెఱుంగవలయును.

మతధర్మములసార మిదియని యెఱుంగక, పెద్దలవలన దాని నెఱుంగక, కొందఱు పరమతముల నాక్షేపింతురు. అది మిగులఁ బొరపాటు. ఒక్కమతమును జక్కఁగా నెఱుంగుటకే చాలకాలము పట్టును. మానవుల యాయుస్సు స్వల్పము. అందుఁ దొలుత బాల్యము నిరర్థకముగా గడచును. పిదప స్వమతధర్మముల నెఱింగి వాని నాచరించుచుఁ బరమతతత్త్వ మెట్టిదని తన్నిష్ణాతుల జిజ్ఞాసువై యాశ్రయించి వారిబోధ

ముల నెఱింగి నిష్పక్షపాతముగ స్వమతధర్మములతోఁ బోల్చి విమర్శించి మరలఁ దనకుఁ గల్గినసంశయములఁ బెద్దల నడిగి తెలిసికొని యప్పుడేవి సారతమములో నేవి సారములో నిశ్చయించుకొనవలయును. అట్టివారు లోకమునఁ దఱచుగాఁ గానరారు. స్వమతధర్మములనే చక్కఁగా నెఱుంగఁజాలక యేవో నాలుగుమాటలు నేర్చుకొనువారు పరమతధర్మముల నెఱింగినట్లు నటించుచు నవి నిస్సారము లనుటకంటె దుష్కార్య మేది కలదు? భగవంతుని దెలుపుటకే యన్ని మతములు పాటుపడుచున్నవని యన్నింటికి గమ్యస్థాన మొక్కటియే యని మన మెఱుంగుటయే సత్కార్యము. అందెవ్వారి కెంతయోగ్యత గలదో యంతమాత్రమే గ్రహింప వారికి శక్యమగును? ఆచరణము నంతియ. కాన నిన్నిమతము లుండఁ దగినవియే. ఎల్లరు సమానయోగ్యత కలవారు గారుకదా. వారివారి కర్మానుసారము భగవదనుగ్రహమును బడయుట కెంతమాత్రము పాటుపడ నర్హత గలదో యంతమాత్రమే పాటుపడి తృప్తిపడుదురు. ఆతృప్తిని గలిగించుటకే మతధర్మములు భిన్నములుగా నేర్పఱుపఁబడినవి. ముక్తికిఁ బోవఁదగిన వారికిఁ దగినవిషయముల నెఱింగించుటకుఁ గొన్నిమతములు గలవు. వానినే యట్టివారు తెలిసికొనఁ బూనుదురు. అట్టి యోగ్యత లేనివారలకుఁ దగినధర్మములను దెలుపఁ గొన్ని మతములు నెలకొనియున్నవి. అందలి విషయములే యతనికిఁ జాలినవి. మిక్కిలి ధర్మముల నాతఁ డెఱుంగఁజాలఁడు. అట్టి దురూహ విషయములను దెలుపు మతము లాతనికి రుచింపవు. కాని యాతఁ డామతముల నాక్షేపింపరాదు. మతతత్త్వ

మెఱింగిన వారెవ్వరును బరమతముల నాక్షేపింప రనుట వాస్తవము. పరమతధర్మములు నిస్సారము లనువారు వాని తత్త్వ మెఱుంగనివారని మనము నిశ్చయించుకొనవలయును. వారి దూషణములను లెక్కసేయరాదు. పామరు లవ్వాని వలన భిన్నమనస్కులు కారా యని ప్రశ్నించువారు కొంద ఱుండకపోరు. వారికి సమాధాన మేమనఁగా, మతధర్మముల ననుష్ఠించుటకుఁ దగినబుద్ధిని బూర్వకర్మమే యొసంగును. దానిని మార్పఁ బరము గాదు. ఎవ్వ రెన్ని బోధించినను గర్మానుసారమే యతని ధర్మానుష్ఠానతత్పరత యుండును. ఇది మార్పునొందని సిద్ధాంతము. కనుక నితరులు మతమును దూషించినంతమాత్రమున మతము నశించునేమో యని భయ పడుట వేఁడినీరు పోయుటంజేసి యిండ్లు కాలిపోవునేమో యని భయపడినట్టిదే యగును. అద్వైతము మతమే కాదని యొకఁడును, అది దుర్మతమని వేఱొకఁడు, దానిని స్థాపిం చినవారికే యద్దానియందు విశ్వాసము లేదని మఱియు నొకఁడు, శంకరాచార్యులను సంకరాచార్యుఁడని యింక నొకఁడు నాక్షేపించుచు భాషించినచో, వారిని బామరుల నుగా మనము తలంపవలయునే కాని, వారినిగాని వారి మత స్థాపకులనుగాని మన మాక్షేపింపరాదు. నోటికివచ్చినట్లు దూ షింపరాదు. అట్టు లొనరించిన వారివలెనే మీరును బామరులే కదా యని పెద్దలు తలంపక మానరు. స్వమతాభిమాన పిశా చము పట్టి యూఁచుచుండఁగా నట్టివారు ప్రేలుచుందురనియు, వారికాఱులకు బదులుచెప్పుట పాడిగాదనియు బుద్ధిమంతు లెఱుంగవలయును.మతదూషకునకంటెఁ బామరుఁడు వేఱొకఁ

డుండునని తలంచుటయు నొక పాపమని నిశ్చయింపవల యును. శమాదిషట్కసంపత్తిరహితుఁడు జ్ఞానివేషము వేయ రాదు. ఆతనిప్రవర్తనమే యతనిస్థితిని బయల్పఱచును. ముఖ్య ముగా వ్యాజధర్మముల నాచరించుచు ధనము నార్జించి తమ వారిని బోషించుచు దానిం గప్పిపుచ్చుటకై వేషమువూల మున నిస్సంగత్వము నభినయించువా రజ్ఞానులలో మేలుబంతు లనుట యేమాత్రము సత్యదూరము కాదు. ఈవిషయము లన్నియు మనము శ్రీరామచరిత్రమును బఠించి యెఱుంగ వలయును. శ్రీరామునియాచారము సకల ధర్మసారోదాహ రణముకదా.

ఈప్రస్తావమున నొక్కవిషయము స్మృతిగోచర మగు చున్నది. శ్రీమద్రామాయణము వైష్ణవులకొఱకే యేర్పడిన దనియు, వైష్ణవు లగువారు పఠించిననే తత్ఫలము నందఁ జాలుదురనియు, నితరుల కయ్యది ఫలము నీయఁజాలదనియుఁ గొందఱు దేవానాంప్రియు లుద్ఘోషింతురు. అక్కటా! ఇంత కంటె నీచోక్తి వేఱుగనుండదు. అదియే వాస్తవమైనయెడల శ్రీరాముఁడు భగవంతుఁడు కాఁడనియే వారంగీకరించిరని మన మెఱుంగవలయును. పక్షపాతము భగవంతునకుఁ గల దనియేకదా వారి భావమై యుండవలయును. వైష్ణవులనఁగా నర్థమేమి? విష్ణుభక్తులనియేకదా. అదికాక యది యొకజాతి యందు రూఢమందులేని యది తుచ్ఛవాదమే. విష్ణుభక్తులే వైష్ణవు లనఁబడుదురందురేని, ఎల్లవారును వైష్ణవులే; ఎల్ల వారును శైవులే; ఎల్లవారును శాక్తులే; ఎల్లరు గాణాపత్యులే; అందఱు సౌరులే; అందఱు కాపాలికులే. అన్ని రూపములు

నన్ని నామములు గలవాఁ డాతఁడు కాఁడేని, కొన్ని నామములు కొన్ని తాఁపులు నాతనికిం బ్రియములేని, యాతఁడు భగవం తుఁడే కాఁడు.

"అశబ్దమస్పర్శమరూప మవ్యయం
తథా రసం నిత్యమగంధవచ్చ యత్,
అనాద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే." 3-వల్లి.

"అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో
రూపంరూపం ప్రతిరూపో బభూవ,
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపంరూపం ప్రతిరూపో బహిశ్చ." కఠోపనిషత్తు. ౫-వల్లి.

"ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం
చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః." ౭. మాండూ. ౧-ఖండము.

యద్వాచా నభ్యుదితం యేన వాగభ్యుద్యతే,
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే."
౪-మంత్రము. కేనోపనిషత్తు.

"యత్తదద్రేశ్యమగ్రాహ్య మగోత్రమవర్ణ
మచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం,
నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం
తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః."
౬-ముండకోపనిషత్తు.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతితు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్." ౨౯

"అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ స మంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః." 30. గీత-౯.

వదంతి తత్తత్త్వవిదస్తత్త్వం యద్జ్ఞానమవ్యయం,
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి కథ్యతే.” ౧౧.
శ్రీ భాగ. ౧-స్కంధము. ౨-అ.

అను నీశ్రుతిప్రముఖప్రమాణము లన్నియు భగవత్స్వరూపమును దెల్పుచున్నవి. భగవంతునకు నామరూపకల్పనము భక్తునిచ్ఛాధీనము.

“ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా.”

అనునది ప్రసిద్ధమే కదా. కావున భగవంతుఁడు శ్రీరామచంద్రరూపమునను బ్రకృతి సీతారూపమున నవతరించిరని యంగీకరింతురేని, శ్రీరామాయణము భక్తులకందఱకు నుపకరించుననక తప్పదు. వేఱువిధముగా శ్రీరాముని సీతను భావింతురేని భగవదవతారములే కావు కాన, నిది యెవరిదైనఁ గావచ్చును. శ్రీరామాయణ మద్వైత తత్త్వమునే తెలుపునని భావించువారు విశిష్టాద్వైతమునే బోధించునన్నవారి నాక్షేపింపరాదు. ఇతరులుగూడ నిట్లే యని యెఱుంగవలయును. భగవంతు నారాధించునధికార మెల్లరకు నుండఁగా మాకేకాని యితరులకు లేదనువా రెంతమూర్ఖులో తెలుపనక్కఱలేదు. వైష్ణవజాతిచిహ్నము లుండినఁగాని శ్రీరాముని సేవించిన ఫలము కలుగదను తుచ్ఛవాదము కూడఁ బైవిధముగా నింద్యమే కాని ప్రశంసార్హము కాదు. పరాత్పరుఁడు శ్రీరాముఁ డనుపేర నవతరించెనని, యోగమాయయే సీతాదేవిగా నవతరించెనని, వా రిరువుర కవినాభావసంబంధము గలదని (ఎడఁబాయకుండుట), ధర్మరక్షణమే వారికృత్యమని మనము భావింపవలయు. ఏభక్తుఁడు త న్నుపాసించినను వా

రానందింతురు. వారిచరిత్ర మెల్లరకుఁ బఠనార్హమే. భక్తికల వారల కిది యనంత ఫలప్రదము. అది లేనివా రేజాతివా రైనను నిష్ఫలమే యగు ననునదియే యిందలిసారము. ఈ సారము నమ్మినవారలం గూర్చియే యీశ్రీరామావతార తత్త్వము వ్రాయఁబడును గాని వావదూకనికరము నుద్దేశించి కాదు. ఇఁక శ్రీరామచంద్రచరిత్రమును బఠింతము.

## రావణుఁడు మారీచునికడ కరుగుట.

* తరువాత రావణాసురుఁడు రోమహర్షణముగాఁ దోఁబుట్టువు శూర్పణఖ తెల్పినవాక్యముల నాలకించి రాచకార్యములు మంత్రులు తెలుప నాలకించి వారిని వీడ్కొలిపి యంతిపురి కరిగెను. అతఁడం దేకాంతముగా సీతాపహారణవిషయము నాలోచించి యువనిమిత్తమ్మని తొలుత నిశ్చయించి యది దృఢపడుటకై తాఁ బూనినకార్యము నెఱవేర్చువిధములలో నేవిధమున నొనరించినదోష మల్పము? ఎందు గుణము మిక్కిలిగా నుండును? అని వాని దోషగుణముల బలాబలములను విమర్శించి చివర కది యీపద్ధతిగా నొనరింపవలయునని మనస్సున స్థిరపఱచుకొని యిఁక నామార్గమునుండి చలింపరాదనుకొని యటనుండి ఘోటకనిలయమున కరిగెను. అవ్వీరుఁడు తనపూనిక భార్య మంత్రులు నెఱింగిన నివారింతురని తలంచి యితరులకు దురూహమగునట్లు లద్దాని దాఁచి యజ్ఞశాలకుం జని సారథింజూచి వేగ రథము నాయత్తముచేయుమని యాన

* ఇయ్యది శ్రీరామాయణమున నారణ్యకాండమున ముప్పదైదవ సర్గమునఁ గలదు.

తిచ్చెను. ఆతఁడు వేవేగ సమ్మతమగునరదమును సిద్ధముచేసి తెచ్చెను. ధనపతి సోదరుఁడు కావున నారావణుఁడు శ్రీమంతులకుఁ దగినయట్లు లొప్పి కామగతిగలిగి రత్నముల నలంకరింపఁబడి పిశాచవక్త్రములు రత్నభూషితములు నగు ఖరములంగట్టిన యాయరదమును మేఘధ్వనులు గలదాని నెక్కి సాగరప్రాంతమున కరిగెను. దేవమునివైరియగు నా దానవాధిపతి రాజోపచారములు గలిగి కన్నులకుఁ బండువుచేయుచు నిరువదిచేతులు పదిశిరస్సులు గల గొప్పపర్వతమట్లు ప్రకాశించుచు నాయరదమునెక్కి మెఱుపులతోఁ గొక్కెరలతోఁ గూడిన మేఘమువలెఁ బ్రకాశించెను.

సాగరప్రాంతము పర్వతనికరయుక్తమైయుండఁగాఁ గాంచుచుఁ బోయెను. ఆతీరము వర్ణనాతీతము. సిద్ధచారణగంధర్వాదు లందు విహరింతురు. అచ్చరమిన్న లందందు నెలకొన్నసరస్సుల వినోదింతురు. దేవతలదంపతు లందందు విహారములు సల్పుదురు. అందుఁగల సరోవరములఁ గ్రీడించు రాయంచలు లోనగు జలపక్షులరొదలు వినఁబడుచుండును. ఓషధివిశేషములు ద్రుమవిశేషములు నందుఁ గన్నులపండువు చేయుచుండును. ఉపవనము లనేకము లందుఁ గనఁబడుచుండును. సెలయేళ్లు సాగరమున సంగమించుస్థలము లెన్ని యోకనఁబడుచుండును. ఆత్రోవ నరుగునపు డాతని మేనును శీతలవాతపోతములు సంతోషభరితము గావించెను. ఒక్కచో నొక్కవటవృక్షము మేఘమువలె నుండఁగా నాతఁడు కనుఁగొనియెను. ఋషు లందుండిరి. నూఱుయోజనములపొడవుగలశాఖ లద్దానికిం గలిగి యచ్చెరువుగ నుండెను. అందే

మున్ను గరుత్మంతుఁడు పృథుకాయముగల గజకచ్ఛపముల నాహారించుటకై వ్రాలెను. అతని మహాభారమునకుఁ దాళఁ జాలక యాకొమ్మ మహాధ్వనితో విఱిగినది. ఆశాఖక్రిందఁ జంద్రసూర్యులకిరణములను ద్రావువారును, ధూమపానము చేయువారును, నయోనిజులు నగువైఖానసులు వాలఖిల్యులును మాషసంజ్ఞికులు నగుమహర్షులు కూడి తపము సల్పుచుండిరి. గరుడుఁ డామునులయందుఁ గలకరుణచే నామహాశాఖను గజకచ్ఛపములను దీసికొనిపోయి యొక్కకాలిమీఁద నిలిచి వానిందిని యామహాశాఖను నిషాదగ్రామముపై విసరి దాని రూపుమాపి మహామునుల విడిపించి సంతుష్టుఁ డయ్యెను. ఆసంతోషమున బలము రెండింతలు కాఁగా నమృతమును దెచ్చు తలంపుగలవాఁ డయ్యెను. అవ్వల నయోమయగవాక్షములను భేదించి రత్నమయగేహము హతముచేసి యింద్రునింటఁ జక్కఁగా రక్షింపఁబడునమృతమును దెచ్చెను. గరుడునిచే విఱుగఁగొట్టఁబడిన యాకొమ్మ గుఱుతుగల్గి సుభద్రనామముగల యామఱ్ఱిచెట్టును రావణుఁడు కాంచెను. ఆ రావణుం డారీతి సముద్రము నవ్వలిగట్టుచేరి యందొకచోట నేకాంతము మనోహరము నగు నడవినడుమ నొకయాశ్రమమును గాంచెను. అందు వల్కలములు కృష్ణాజినము జటలు ధరించి నియతాహారుఁడై యుండు మారీచుం గాంచెను. ఆతనింజూడఁగా నతఁడు దుర్లభపదార్థములచే నా రాక్షసరాజుం బూజించెను. మిక్కిలి యర్థవంతముగా రాక్షసనాథా! లంకయం దందఱకు క్షేమమే కదా. మరల నొంటిగా వచ్చితివే

ఏల? అని ప్రశ్నముచేయఁగా వాగ్వైఖరి యలరార నా రావణుం డిట్లు బదులుచెప్పెను.

మహామతులారా! ఈభాగమున ననేకవిషయములు విమర్శింపఁదగినవి కలవు. యథామతిఁ బరికింతము.

"తతశ్శూర్పణఖావాక్యం తచ్ఛ్రుత్వా రోమహర్షణం,
సచివానభ్యనుజ్ఞాయ కార్యం బుద్ధ్వా జగామ సః." ౧

అని మూలము. "శూర్పేణ శోణితభాజనేన యజ్ఞాదిసత్క్రియాం నఖయతి దూషయతీతి శూర్పణఖా. నఖ దూషణే." అనునదియే మంచి వ్యుత్పత్తి. "శూర్పాకారాణి నఖాని యస్యాస్సా." అనునది సాధారణముగాఁ జెప్పునట్టి వ్యుత్పత్తి. సత్కార్యభంగ మొనరించుటయే దానిస్వభావము. ఈమహాకార్యమును సాగింప నాశూర్పణఖయే ప్రధానిత్వమును వహించె ననవలయు. కనుకనే సీతాసౌందర్యమును వర్ణించి వర్ణించి రావణునకు గగురుపాటు గలిగించెను. అనఁగా నావాక్యము లాతనిమనస్సు గలంచివైచెనని భావము. ఇపు డా రావణుఁడు కర్మపాశబద్ధుఁడై యాత్మనాశన మొనరించుపని చేయ సిద్ధపడియున్నవాఁడని మన మెఱుంగవలయు.

"ప్రాయస్సమాపన్నవిపత్తికాలే ధియోఽపి పుంసాం మలినా భవంతి."

అనుసూక్తి క్రొత్తది కాదు. ఎంతటి బుద్ధిమంతులైనను గర్మగతుల ననుసరించి తప్పని సరిగా కార్యముల నొనరింతురని శ్రీకృష్ణమూర్తియే గీతలయందుఁ దెలిపెను.

"స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్." ౬౦-గీత. ౧౮-అ.

విధి యిట్టులుండఁగా నాతఁ డేమిచేయంగలఁడు? రావణుఁ డిపు డస్వాతంత్ర్యుఁడని మన మెఱుంగఁదగునని యీక్రింది మూలమే తెలుపుచున్నది. నిపుణముగాఁ బరికింతము.

"తత్కార్యమనుగమ్యాథ యథావదుపలభ్య చ,
దోషాణాం చ గుణానాం చ సంప్రధార్య బలాబలమ్. 2

ఇతికర్తవ్య మిత్యేవ కృత్వా నిశ్చయమాత్మనః,
స్థిరబుద్ధిస్తతో రమ్యాం యానశాలాం జగామ హ." 3

అని మూలము. శూర్పణఖ తెలుపకముందే మారీచునికడ కరిగి నిరుత్సాహుఁడై మరలి వచ్చినవాఁడేకదా రావణుఁడు. మరల శూర్పణఖ తెలిపినంతన యెట్లు ముగ్ధుఁ డయ్యెను? కర్మబద్ధము లోకముకదా. అను నీసిద్ధాంతమును

"నహి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః." గీ. 3-5.

అను నీ గీతావాక్యము తెలుపుచున్నది. దానవాధిపతి విద్వద్వరిష్ఠుఁడుగాని సామాన్యుఁడు కాఁడు. వేదరహస్యము లెఱింగిన ప్రోడ. కావుననే గుణములను దోషములను దాఁ జేయఁబోవు కార్యమునఁ దర్కించెను. ఆవిమర్శ మేరూపమైనది? పౌరుషసాధ్యమా? లేక చౌర్యసాధ్యమా? అనునట్టిదియే. గుణదోషబలాబలవిమర్శమునందుఁ బరాక్రమమునఁ జేయఁబూన దోషములు మెండని ఖరాదివధవృత్తాంతశ్రవణమున నెఱిఁగెను. ఇఁకఁ బురికొలుపుచున్న కర్మపాశముల వదలించుకొనఁజాలమి చౌర్యమున గుణము లధికములని తలంచెను. ఈకార్యము చౌర్యసాధ్యమే కాని పౌరుషసాధ్యము

కాదని నిశ్చయించెను. ఆవఱకున్న చాంచల్యము మదినుండి తొలంగెను. స్థిరబుద్ధి కుదిరెను. అంతటివిద్వద్వతంసుని లోఁబఱచుకొన్న దేది? కర్మమేకదా. కావుననే "గహనా కర్మణో గతిః" అని భగవంతుఁడు తెలిపెను. "గహనా దుర్విజ్ఞేయా" అని శ్రీశంకరభగవత్పాదులు వ్రాసిరి. దుర్. వి. అను రెండుపసర్గములు చేర్పఁబడినవి. అత్యంతాసాధ్యమని యవి తెలిపెడిని. దుష్కార్యకరణమున నతనికి బుద్ధి స్థిరతం గాంచెనని భావము. ఇంక నొకక్షణమైన నిలువఁ జాలఁడు. మంత్రులను సాగనంపెను. తానే యశ్వశాల కరిగెను. ఈవిషయమును జక్కఁగాఁ బరిశీలింపఁగా హరిహరబ్రహ్మాదులుకూడఁ గర్మగతుల మీఱఁ జాలరనియుఁ బ్రపంచమంతయుఁ గర్మాధీనమనియుఁ దేలెడిని. తన్నుమించినశూరుల ఖరదూషణాదుల నొక్క ముహూర్తమాత్రమున గీటడంచినప్రౌఢ రామభద్రుఁడని యెఱింగియు మారీచుఁడు స్వానుభవములని యెఱింగించినమాటల నాలకించియు నకార్యకరణమునకు రావణుఁడు పూనుట నాలోచించితిమేని కర్మాధీనమే జగత్సంతతి యని తేలక మానదు. ఇట్టు లుండఁగా మధ్యవైష్ణవులు కొందఱు

> "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
> అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."
>
> ౬౬-గీత. అధ్యా-౧౮.

అను శ్రీకృష్ణోక్తి నుదాహరించి కర్మములను వదలి గురువును సేవించినఁగాని సంసారముక్తికాదని పామరు లగుశిష్యులకు బోధింతురు. కాని

"ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యామిమాః ప్రజాః. ౨౪
సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాంస్తథాసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్." భ.గీ. 3-అ.

అను నీవాక్యములు భగవంతునివే యని యెఱుంగరు. ఈ రెండువిషయములం బరికింపఁగా భగవంతుని తాత్పర్యమే మని బుద్ధిమంతులకుం దెలియకపోదు. శ్రీరామచంద్రుఁడు కర్మబద్ధుఁడైనట్లు నటించుటయే కర్మము త్యాజ్యము కాఁదగ నిదని తెలియఁజేయుచుండలేదా. కర్మబద్ధుఁడు కానివాఁ డొక్కఁడు భగవంతుఁడే యని మనమెఱింగిన నీయుపదేశములు స్వార్థపరులపలుకులని తోఁపకపోదు. కావున రావణునంతటి పండితునిగూడ నిట్టిదుష్కార్య మొనరింపఁ బురికొలిపినది వాని కర్మమనియే మనము నిశ్చయింపవలయును.

"మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి."

అను భగవద్వాక్య మెక్కాలమున వ్యర్థము కాదనియు నమ్మి తరించుసుపాయ మెట్టిదని యూహింపవలయును.

"యానశాలాం తతో గత్వా ప్రచ్ఛన్నో రాక్షసాధిపః,
సూతం సంచోదయామాస రథస్సంయోజ్యతామితి." ౪

అని మూలము. "ప్రచ్ఛన్నః.ప్రకాశశ్చేద్వృద్ధా మందోదర్యాదయశ్చ వారయిష్యంతీతి భావః. యద్వా పౌరుషం విహాయ చౌర్యమార్గాశ్రయణం లజ్జావహామితి ప్రచ్ఛన్నమార్గాశ్రయణమ్"అని గోవిందరాజులు వ్రాసిరి. "ప్రకాశం చేద్వృద్ధావారయిష్యంతీ త్యభిప్రాయః."అని మహేశ్వరతీర్థులు.రావణుఁడు లంకావాసుల కెవ్వరికిని దెలియకయుండ నీకార్య మొనరింపఁ

బూనెననియు, నెఱింగించిన నెల్లరు వలదందురనియు, నీభావ మును ప్రచ్ఛన్నశబ్దము తేటపఱచుచున్నది. సకలవిధములఁ దోడ్పడువారలకుంగూడఁ దెలుపక దుష్కార్యమని తెలిసియుఁ జేయసాహసించునట్లు చేసిన దెవరు? ఆతనికర్మమే. వేఱొక కారణమును దేనిని జెప్ప వలసుపడదు.అతనికి నాయువు సమీ పించుచున్నది. శ్రీరామునిచే మృతి గలుగవలయునన్న విధి మార్పరానిది. ప్రకృతిసంకల్ప మమోఘము. త్వరగా రమ్ము. నీదేహవిముక్తికై యిందుఁ గాచియున్నానని మహాప్రకృతి తలంచుచున్నది. ఇఁక వాఁడు స్వతంత్రుఁ డగుటయెట్లు? భగ వదిచ్ఛను మార్పఁదలంచువాఁడును గలఁడా? అది శక్యమా? ఈభాగముకూడఁ గర్మసిద్ధాంతమునే తెలుపుచున్నది కదా! లంకానగరమునఁ గలవారలందఱు దుష్కార్యమునకు రావ ణునిం బురికొలుపువారు కారనియు' నిట్టికార్యము లొనరింప రాదనువారలే యనియు మన మెఱుంగవలయు. "రాజాను మతోధర్మః"అన్న న్యాయము ననుసరించి రాజుంగూడి యుద్ధము చేయఁబోవువారలనియు నెఱుంగందగు. ఏల యాతని వదలి పెట్టఁ గూడదందురేని యుద్ధమరణము గలుగవలయునన్న వారికర్మగతిని దప్పించుకొన శక్యముకాదు. కావునఁ దుద కందుల కంగీకరించి రనుటయే యిందు సారమని మనము గ్రహింపందగు.

"పిశాచవదనైర్యుక్తం ఖరైః కాంచనభూషణైః." ౬

అని మూలము. ఖరము లనఁగా నశ్వతరములని భావము. కంచరగాడిదలని చెప్పఁబడునవి. ఖరములఁ బూన్చినరథము ఖరవాహనము రాజులకు రాజపత్నులకు నర్హమే యగును.

"త్రస్తస్సమస్తజనహాసకరః కరేణో-
స్తావత్ఖరః ప్రఖరముల్లలయాంచకార,
యావచ్చలాసనవిలోలనితంబబింబ
విస్రస్తవస్త్రమవరోధవధూః పపాత" ౭. మాఘకావ్యము, ౫-సర్గము.

అని మాఘకవి చెప్పెను. అనర్హమగువాహనమున శ్రీకృష్ణుని యంతఃపురకాంతలు కూరుచుందురా? "ఖరః అశ్వతరః" అని శబ్దకల్పద్రుమము. ఈయశ్వతరము బ్రాహ్మణులకు ననర్హమని యెఱుంగవలయు.

"ఉష్ట్రయానం సమారుహ్య ఖరయానంతు కామతః,
స్నాత్వాతు విప్రో దిగ్వాసాః ప్రాణాయామేన శుద్ధ్యతి." ౨౦౧.
మను. ౧౧-అధ్యా.

అను నీస్మృతియు బోధించుచున్నది. కావున బ్రాహ్మణులకుఁ దప్పఁ దక్కినవారలకు రాసభవాహనము యోగ్యమే యని మన మెఱుంగవలయు. అశ్వతరమునకుఁ గంచరగాడిదె యనుట వాడుక. దానింబట్టి మన మయోగ్యవాహన మనరాదు. ఈ కాండమునందే ముప్పదొకఁడవసర్గమునందు

"అథైవముక్త్వా ప్రయయౌ ఖరయుక్తేన రావణః,
రథేనాదిత్యవర్ణేన దిశస్సర్వాః ప్రకాశయన్." ౩౮

అని చెప్పఁబడినది. అందు వ్యాఖ్యానమున ఖరలక్షణము లశ్వశాస్త్రమునం దున్నరీతి వ్రాయఁబడినది.

"అశ్వస్పృగ్భ్యస్సముత్పన్నా స్తస్మా దశ్వతరాః ఖరాః,
ఖరరూక్షస్వరాస్తీక్ష్ణాః ఖరశీలాః ఖరాంఘ్రయః."

అని. "అశ్వతరః. తసురశ్వః. అశ్వాయాం గర్దభేన జాతః పశువిశేషః ఇతి స్మృతిః. హయానశ్వతరానుష్ట్రాన్ తథైవ సురభే

స్సుతాః. ఇతి రామాయణే.” అని శబ్దకల్పద్రుమము. తఱచుగా రాక్షసుల కిట్టివే వాహనములుగా నుండునట్లు పురాణాదులయందును గనంబడుచున్నది.

“అశ్వారోహా గజారోహా గర్దభారోహిణః పరే. ౧౫
ఉష్ట్రారోహా వృకారోహా శ్శునకారోహిణ స్తథా,
కాకాధిరోహిణో గృధ్రారోహాః కంకాధిరోహిణః, ౧౬
వ్యాఘ్రాదిరోహాశ్చ పరే తథా సింహాధిరోహిణః,
శరభారోహిణశ్చాన్యే భేరుండారోహిణః పరే. ౧౭
సూకరారోహిణో వ్యాళారూఢాః ప్రేతాధిరోహిణః,
ఏవం నానావిధైర్వాహా వాహిభిర్దళితాం ప్రతి.” ౧౮

ఇట్టి వెన్నియో తావులం గనంబడును. గృధ్రము కాకము కూడ వాహనములా యని కొంద ఱాక్షేపించిరి. గరుత్మంతుఁ డేల యోగ్యవాహనము విష్ణువున కయ్యెనో యట్లే యితరులకు నని మన మూహించిన యీశంకలు కలుగఁబోవు.

“దేవదానవసంఘైశ్చ చరితం త్వమృతాశిభిః”. ౧౬

అని మూలము. “అమృతాశిభిః దేవదానవసంఘైశ్చ చరితమ్” అని యన్వయక్రమము. “అమృతమశ్నంతీత్యమృతాశినస్తైః దేవదానవసంఘైః.”అనుచో నమృతపానము దేవతలకు దానవులకుం గూడఁగలదని యేర్పడుచున్నది. దానవు లమృతపానము చేసిరనుట యసంగతమే యగు. కాన నిందుఁ గల “అమృతాశిభిః.”అనువిశేషణము దేవతలకే చెల్లుననవలయు. “దేవదానవసంఘైః.” అను నీ సమాసమునందు నేకదేశమునందే దాని నన్వయించుట ప్రాయికముగాఁ జెల్లదు.

“నలోపస్సుప్స్వరసంజ్ఞాతుగ్విధిషు కృతి.” అని సూత్రము.

"సుబ్విధౌ స్వరవిధౌ సంజ్ఞావిధౌ కృతి తుగ్విధౌచ న లోపః."

అని వృత్తి. కృతియనునవి సమాసమధ్యగతతుక్పదమునం దె ట్లున్వయించెనో యిందు నట్లే యనవలయు. వ్యాకరణశాస్త్రము నందే యిట్టియుదాహరణము కనఁబడఁగా నీకనేల యిందు సందేహింపవలయును? అమృతాంధసులు దేవతలనుట సుప్రసిద్ధము. కొందఱు అమృతమనఁగా క్షీరములని నానార్థము కలదు గాన నమృతముఁ ద్రావినదేవతలు పాలుత్రాగినదానవు లని యర్థము చెప్పవలయు నందురు. అది సమంజసము కాదు. పాలు దేవతలు త్రాగరని యెందైన నిషేధింపఁబడినయెడల నది యించుక సరిగా నుండునేమో కాని యది కానరాదు గాన నిదియు సుసంగతము కాదనవలయు. ఇచ్చో నాంధ్రీకరణములను గాంచి యానందింతము.

"అజైర్వైఖానసైర్మాషైర్వాలఖిల్యై ర్మరీచిపైః,
అత్యంతనియతాహారై శ్శోభితం పరమర్షిభిః,
జితకామైశ్చ సిద్ధైశ్చ చారణై రుపశోభితమ్."

అను నీమూలమునకు

తే. "అజుల వైఖానసులచేత • ననఘమాష
వంశజులచే మరీచిప • వాలఖిల్య
గణముచేతను సిద్ధచారణులచేతఁ
జెలఁగు వేలాప్రదేశంబుఁ • జేరఁ జనియె." ౫౪౫

అని వాసుదాసుగారు వ్రాసిరి. పిదపఁ గలమూలముఁ గనుఁడు.

"దివ్యాభరణమాల్యాభిర్దివ్యరూపాభిరావృతమ్,
క్రీడారతివిధిజ్ఞాభి రప్సరోభిస్సహస్రశః." ౧౬

సేవితం దేవపత్నీభిశ్శ్రీమతీభిశ్శ్రియావృతం,
దేవదానవసంఘైశ్చ చరితం త్వమృతాశిభిః. ౧౭
హంసక్రౌంచప్లవాకీర్ణం సారసైస్సంప్రణాదితం,
వైడూర్యప్రస్తరం రమ్యం స్నిగ్ధసాగరతేజసా. ౧౮
పాండరాణి విశాలాని దివ్యమాల్యయుతాని చ,
తూర్యగీతాభిజుష్టాని విమానాని సమంతతః. ౧౯
తపసాజితలోకానాం కామగాన్యభిసంపతన్,
గంధర్వాప్సరసశ్చైవ దదర్శ ధనదానుజః. ౨౦
నిర్యాసరసమూలానాం చందనానాం సహస్రశః,
వనాని పశ్యన్ సౌమ్యాని ఘ్రాణతృప్తికరాణిచ." ౨౧

ఈమూలమునకు ఆంధ్రవాల్మీకిరామాయణమునందు

సీ. "ఆటలఁబాటలఁ ♦ బాటనవేలుపుఁ
బాటలాధరలెల్ల ♦ నీటుమెఱయ
నంచలుఁ గ్రౌంచులు ♦ నంచితముగ స్వర
సంచయంబులఁ జెవుల్ ♦ నించుచుండ
హారసంభారముల్ ♦ హారివిశాలముల్
నీహారతుల్యముల్ ♦ నిర్మలములు
వరమనోహరగీత♦వాదిత్రసంజుష్ట
దేవయానంబులు ♦ తేజరిల్ల
తే. నచ్చరలను గంధర్వవి♦యచ్చరులను
నిజతపోబలజితలోక ♦ నిచయఘనుల
మఱియుఁ నిర్యాసమూల ♦ మహితచంద
నాగరుధరారుహంబుల ♦ నందమగుచు." ౫౫౬

అను నీపద్యమొండు కనుపట్టెడు. ఆర్యులారా! ఆమూలము

లను నీపద్యముం బరిశీలింపుఁడు. సంబంధ మెంతమాత్రము కలదో పరికింపుఁడు. హెచ్చుగ విమర్శింపను. మూలమునుండి యెంత గ్రహింపవలయునో యది గ్రంథకర్తల యిచ్ఛననుసరించి యేయుండును. ఏల యీభాగము వదలితిరని ప్రశ్నింపరాదు. ఇపుడేల దీని నిటఁ బొందుపఱచితి వందురేమో పక్షపాతము గలవిమర్శను సిద్ధాంతిం గాంచిరేయైన మూలార్థమెల్ల నిందుఁ గల దని పొగడుచు నారామాయణము నాక్షేపింపకుందురుగాక యని వారికి తెలుపుటకే యిట దీని వ్రాసితి. గ్రంథకర్తల కిద్దానికి సంబంధము లేదు. ఈభాగమునకు నా వ్రాసినపద్యములఁ బత్తగింపుఁడు. "అజైర్వైఖానసైః." అను మూలము నుండి యివియని గ్రహింపుఁడు.

సీ. "మఱి యయోనిజులయి • మహితులౌ వైఖాన
సులు మాషగోత్రభవులయి సూర్య
చంద్రుల కాంతులే • సతతమాహారంబు
గల వాలఖిల్యులు • గడు నియతము
గాఁ దగునాహార • కలితులౌ పరమర్షు
లలరుచుండిరి; కామములను గెల్చి
నట్టిసిద్ధులు చారణాదులు శోభిల్లి
రమలదివ్యాభరణాభిరామ

తే. లగుచు దివ్యాకృతులనొప్పి • సొగసుఁగులుకు
నట్టి క్రీడారతుల సెల్ల • నాత్మలనెఱిఁ
గిన సురాంగన లెందఱో • తనరుచుండి
రమల సతులొప్పుచుండి రయ్యబ్ధిదరిని.

క. సిరులలరారఁగ నంబుధి, దరియది శోభిల్లుచుండెఁ • దగినవిధమునన్
సురలమృతాస్వాదనమునఁ, బరఁగియటన్ సంతతంబు •భాసిలి దితిజుల్.
సీ. దేవకలును గ్రీడఁ • దేలుచునుండఁగ
జలకుక్కుటములు క్రౌం•చములు హంస
లందుఁ గ్రీడింపఁగ • నట్లె సారసవిహం
గములు కూయఁగ సొంపు • లమరఁ జెలఁగె;
వైదూర్యరత్నముల్ • భాసిల్లనందమై
సాగరకాంతి సె•సంగి మించి
యుండె; నంతట రావ•ణుండు పాండరములు
నాయతంబులును ది•వ్యములు నగుచు
మాల్యయుక్తంబులై • మఱియుఁ దూర్యధ్వనుల్
సంగీతసాధుని•స్వనము లొప్ప
తే. నందముగఁ జూడఁగాఁ దగి • నట్టిదగుచుఁ
గామగమనంబులై తపో•ఘనబలమున
దివ్యలోకంబు సాధింపఁ • దేజరిల్లు
పురుషులెక్కువిమానముల్ • పొదలుచుండ. 910
క. కనియెన్ గంధర్వగణం
బును నప్సరసలను మఱియుఁ • బొలుపారెడు వ
స్తునికరమును దశవదనుఁడు
కనియెన్ సంద్రంబుదరిని • గడురమ్యముగన్. 911
సీ. చారువిస్తారసం•బుతోఁగూడు మూ
లములచు నోషధు•లను, మనోజ్ఞ
ములు ఘ్రాణతృప్తిద•ము లగువాసనలను
జల్లుచుఁ జందన•స్తోరుహమ్ము
లలరార నొప్పు వ•నాళి........” ఆంధ్ర శ్రీమద్రామాయణము.

పాఠకమహాశయు లింకేని మూలార్థమును బోధించునో యద్దాని నిశ్చయింపఁ గలరు. పురికొల్పఁబడి విమర్శింపఁ బూనినవారలకుఁ గనఁబడునవి సత్యదూరము లగువిషయములే యని యిందు తెలుపుదును. ఇఁకఁ గథావిషయమును విమర్శింపఁ బూనుచున్నాను.

"తత్రాపశ్యత్స మేఘాభం న్యగ్రోధమృషిభిర్వృతమ్. ౨౭
సమంతాద్యస్య తాః శాఖాః శతయోజనమాయతాః,
యస్య హస్తిన మాదాయ మహాకాయం చ కచ్ఛపమ్. ౨౮
భక్షార్థం గరుడశ్శాఖా మాజగామ మహాబలః,
తస్య తాం సహసా శాఖాం భారేణ పతగోత్తమః. ౨౯
సుపర్ణః పర్ణబహులాం బభంజ చ మహాబలః,
తత్ర వైఖానసా మాషా వాలఖిల్యా మరీచిపాః. ౩౦
అజా బభూవు ర్ధూమ్రాశ్చ సంగతాః పరమర్షయః,
తేషాం దయార్థం గరుడ స్తాం శాఖాం శతయోజనామ్. ౩౧
జగామాదాయ వేగేన తౌ చోభౌ గజకచ్ఛపౌ,
ఏకపాదేన ధర్మాత్మా భక్షయిత్వా తదామిషమ్. ౩౨
నిషాదవిషయం హత్వా శాఖయా పతగోత్తమః,
ప్రహర్ష మతులం లేభే మోక్షయిత్వా మహామునీన్. ౩౩

... ... ... ...

తం మహర్షిగణైర్జుష్టం సుపర్ణకృతలక్షణం,
నామ్నా సుభద్రం న్యగ్రోధం దదర్శ ధనదానుజః." ౩౬

అని మూలము. ఈభాగ మనేకసంశయము గలుగఁజేయఁ జాలినదే. సముద్రతీరవర్ణన మిందుఁ గలదు. ఈసర్గముననే పదునాల్గవశ్లోకమునందే అజవైఖానసులు మాషవాలఖిల్యులు

పేర్కొనఁబడిరి. వారెల్లరు సముద్రతీరమునఁ గలవనముల నున్నవారనియే కదా యర్థము. రావణుఁడు పోవుచున్నది దక్షిణసముద్రతీరముననే యనవలయును. ఆగమనము కొంత తూర్పుసంద్రముదరిని గావచ్చును. అందేకదా మారీచుఁడు తపస్సుచేయునాశ్రమము కలదు. ప్రాగ్దక్షిణసముద్రాంతరమైనఁ గావలయు. సముద్రతీరమునం దడవులుండుటయు నందు మృగపక్షు లుండుటయు నందు విశేషించి మడుఁగులుండు టయు నందుఁ గమలము లుండుటయు స్వభావవిరుద్ధము కాదు. దేవతలు విమానములపై సంచరించుటయుఁ బ్రసిద్ధమే. మహర్షులరణ్యములయందే యుందురనుటయు నిర్వివాదము. వాలఖిల్యు లనుమును లఱువదివేలసంఖ్య గలవారలనియు నంగుష్ఠమాత్రశరీరులనియు విందుము కదా. వారెల్ల రొక్క చోట నుండువారనియుఁ బెద్దలందురు. ఈసర్గమున వాల ఖిల్యులు వనముల నున్నయట్లు పేర్కొనఁబడినది. ఇతరమును లతో వారు నడవులఁ దపోనిష్ఠ నున్నయట్లు తెలుపఁబడినది. అది యసంగత మనరాదు. సాగరతీరమునఁ జనుచున్న రావణుఁ డొకమఱ్ఱిచెట్టును గాంచెను. అందొక్క మహాశాఖ విఱిగి నట్టిగురుతు కనఁబడుచుండెను. దానికొమ్మలు శతయోజన ములు వ్యాపించినవి. అనుభాగము పఠింపఁగనే కొందఱు విచిత్రమే యిది యనకమానరు. శతశబ్దము విస్తృతిబోధక మని గ్రహించిన నచ్చెరువున కవకాశమే కలుగదు. కోటి యోజనములయెత్తుగలది హిమాలయమని యుండుతావుల నిట్లే గ్రహింపవలయును. పంచాస్యము సింహమనఁగా నైదు మోములు గలదికాదని వెడలుపైన మోముగలదని యెట్లు

గ్రహింతుమో యట్లే యిట్టితావులయందును గ్రహించిన నే బాధలును గలుగవుకదా. ఆ మఱ్ఱిచెట్టునందు విఱిగియున్న గుఱుతు కనఁబడియెనని యున్నది. ఆకొమ్మ నాశ్రయించియే పూర్వము వాలఖిల్యులు తపస్సొనరించుచుండిరని చెప్పఁబడినది. ఇదియే సందియమును గల్గించుభాగము. ఈవిషయము మహాభారతమున విస్తరించి చెప్పఁబడినది. దానిం బరిశీలింతము.

"సాగరాంబుపరిక్షిప్తాన్ భ్రాజమానాన్ సహద్రుమాన్,
తమువాచ ఖగశ్రేష్ఠం తత్ర రౌహిణపాదపః. ౪౨
అతిప్రవృద్ధస్సుమహాన్ ఆపతంతం మనోజవం,
యైషా మమ మహాశాఖా శతయోజన మాయతా. ౪౩
ఏతామాస్థాయ శాఖాం త్వం ఖాదేమౌ గజకచ్ఛపౌ."

ఆదిపర్వము, ౨౯-అధ్యా.

"స గత్వా పర్వతశ్రేష్ఠం గంధమాదనమంజసా. ౯
దదర్శ కశ్యపం తత్ర పితరం తపసి స్థితం,
దదర్శ తం పితా చాపి దివ్యరూపం విహంగమమ్. ౧౦

... ... ... ...

తతః ప్రసాదయామాస కశ్యపః పుత్రకారణాత్. ౧౬
వాలఖిల్యాన్ మహాభాగాం స్తపసా హతకల్మషాన్,
కశ్యపః:—ప్రజాహితార్థ మారంభో గరుడస్య తపోధనాః. ౧౭
చికీర్షతి మహత్కర్మ తదనుజ్ఞాతుమర్హథ,
ఏవముక్త్వా భగవతా మునయ స్తే సమభ్యయుః. ౧౮
ముక్త్వా శాఖాం గిరిం పుణ్యం హిమవంతం తపోర్థినః,
తత స్తేన్వపయాతేషు పితరం వినతాసుతః." ౧౯

ఆదిపర్వము, 3౦-అధ్యాయము.

ఈభాగముంబట్టి పరిశీలింపఁగా సముద్రతీరమున మఱ్ఱిచెట్టుండుట స్పష్టము. వాలఖిల్యమహర్షులు దాని కొమ్మయందు వ్రేలాడుచునుండఁగా గరుత్మంతుఁడు దానిపైఁ బాదము లుంచినంతనే యవి విఱిగెను. దాని నోటఁగఱచుకొని గంధమాదన పర్వతమునఁ దపోనిష్ఠనుండు తండ్రికడ కతఁ డరిగెను. కశ్యపముని యావిధ మెఱింగి వాలఖిల్యులం బ్రార్థించి శాంతకోపులఁగా నొనరింప వారు హిమాలయమునందుఁ దప స్సొనరింపఁ బోయిరి. రావణాసురుఁడు మారీచునికడకుఁ బోవుచుండఁగా సాగరప్రాంతారణ్యముల వాలఖిల్యాదిమహర్షులు తపోనిష్ఠనుండఁగాఁ గాంచెనని రామాయణమునఁ గనంబడియెడి. హిమాలయమునఁ దపస్సొనరింపఁ బోయినవా రీచోటికెట్లు వచ్చిరని కొందఱు ప్రశ్నింతురు. ఈప్రశ్నము యుక్తియుక్తముకాదని తోఁచెడిని. యుగాంతరములయందుఁగూడ నున్నతావు మార్పక మునులుండుట కయ్యది తండ్రి తాతలు సమార్జించిన కాణాచియా. కాదుకాదా. కావునఁ గాలాంతరముననే యవికాని మార్పునొందక యట్లేయుండునని తలంచుటయు నొకపొరపాటే యనవచ్చును. భారతమునఁ బేర్కొనిన వటవృక్షము రోహిణనామకము. రామాయణమునఁ జెప్పఁబడినది సుభద్రనామకము. ఇట్లుండఁగా నదియే యిది యని యెట్లు చెప్పవచ్చును? అను ప్రశ్నము కలదు. మానవులకే నామాంతరము లనేకము లుండఁగా వృక్షములకేల యుండ రాదు. అని సమాధానము చెప్పవచ్చును. పురాణాంతరముల యందు రోహిణమను మఱ్ఱిచెట్టు హిమాలయప్రాంతమునఁ గలదనియు గరుత్మంతునిచరిత్రమున దానిప్రస్తావమే కల

దనియుఁ గనంబడిన నేమి సమాధానమని ప్రశ్నింపవచ్చును. ప్రాయికముగా నతిశయోక్త్యలంకారముల కుదాహరణము లెల్లతావులఁ గనంబడును గదా. దానిచే సీరామాయణకథా తత్త్వమున కపకారమేదియుఁ గల్గదనుకొనుచో నే శంకలును గలుగవు.

**"కచ్చిత్సుకుశలంరాజన్ లంకాయాం రాక్షసేశ్వర,**
**కేనార్థేన పునస్త్వం వై తూర్ణమేవ మిహాగతః."** ౮౧

అనునిది మారీచవాక్యము. రావణుని గాంచినంతనే యేదో మహావిపత్తు కలిగియుండునని యతఁడు భావించెను. పూర్వము నా హితోపదేశమున శ్రీరామునితో విరోధింపఁ బూనక మరలిపోయెను గదా. మరల నీతఁడేల వచ్చెను? అని యనుమానించి లంకయం దెల్లరకుం గుశలమా యని ప్రశ్నించెను. మరల నింతలోనే యేల వచ్చితివయ్యా యనియు నడిగెను. శ్రీరామవిరోధమున నీతఁడు రాక్షసనాశము గలుగుటకు హేతుభూతుఁ డగునని యే మారీచునివిశ్వాసమని మన మెఱుంగవలయును. శ్రీరామమహత్త్వమును మారీచుఁడు స్వానుభవముననే యెఱుంగుననుట నిర్వివాదము. దీనిచే భగవత్తత్త్వమును శ్రీరామునిచరిత్రము వెల్లడించెనని యేర్పడియెడి. సహజవిరోధి యగుమారీచుఁడు హిత ముపదేశించుటయే యిందులకు నిదర్శనము.

**"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి కశ్చన,**
**యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్."**

అను గీతావాక్యమే యీవిషయమును దెల్పుచున్నది. అట్టి మారీచుఁ డేల యపకారమును శ్రీరామునకుఁ జేసెనని

ప్రశ్నింపరాదు. కర్మసిద్ధాంత మద్దానికి సమాధానముఁ గల్పిం చును. భగవత్తత్త్వము నెల్లరకుఁ బ్రేమమును గల్పించు నను సిద్ధాంతమునే మన మెఱుంగవలయును. ఇఁకఁ దరువాతి శ్రీరామచరిత్రము నరయుదము.

## రావణుఁడు మారీచుని సీతాపహరణమునకై సాయముచేయ వేఁడుట.

* వత్సా! మారీచా! నామాటలను శ్రద్ధగ నాలకిం పుము. అత్యంతతార్తుఁడనై వచ్చితిని. నీవే యిపుడు నాకు రక్షకుఁడవైతివి. ఖరాదులందఱు జనస్థానమునఁ గాఁపురముండి ధర్మచారు లగుమునుల బాధించుచుండుట నాయాజ్ఞచేతనే యని నీ వెఱుంగుదువు కదా. వారు పదునాల్గువేలనియు ఖరు ననుసరించియుందురనియు నీకుఁ దెలిసినదియే. వారెల్ల రాము నితో యుద్ధముచేయఁబోవ నారాముఁ డొక కఠినవాక్యము నేని వచింపక ధనుర్విద్యానైపుణ్యమున నొక్కఁడే వారినెల్ల మ్రందఁ జేసెను. దండకారణ్యవాసుల నిపు డారాముఁడు నిర్భయులను గావించెను. తండ్రి రాజ్యమునుండి పాఱఁ ద్రోలఁగా భార్యం గూడి వచ్చిన క్షత్రియవంశపాంసనుఁ డగు నారాముఁడు మృతి చేరువకు రాఁగా నాపక్షమున నుండు వారల రూపుమాపెను. ఆతనివృత్తి దుష్టము. హృదయము కఠినము. ఆతఁడు మహాక్రూరుఁడు, లుబ్ధుఁడు, విషయలోలుఁడు నగు. అధర్మాచరణపరాయణుఁడు. ప్రాణిహింసయం దాతనికిఁ బ్రీతి మెండు. వైరము లేకున్నను ధర్మమునుగూడ లెక్కింపక తనబలమునే నమ్మి యడవిని నాసోదరి ముక్కును జెవులను

* ఇది ముప్పదాఱవసర్గమునఁ గలదు.

ప్రశ్నింపరాదు. కర్మసిద్ధాంత మద్దానికి సమాధానముఁ గల్పించును. భగవత్తత్త్వము నెల్లరకుఁ బ్రేమమును గల్పించు నను సిద్ధాంతమునే మన మెఱుంగవలయును. ఇఁకఁ దరువాతి శ్రీరామచరిత్రము నరయుదము.

## రావణుఁడు మారీచుని సీతాపహరణమునకై సాయముచేయ వేఁడుట.

* వత్సా! మారీచా! నామాటలను శ్రద్ధగ నాలకింపుము. అత్యంతతార్తుఁడనై వచ్చితిని. నీవే యిపుడు నాకు రక్షకుఁడవైతివి. ఖరాదులందఱు జనస్థానమునఁ గాఁపురముండి ధర్మచారు లగుమునుల బాధించుచుండుట నాయాజ్ఞచేతనే యని నీ వెఱుంగుదువు కదా. వారు పదునాల్గువేలనియు ఖరు ననుసరించియుందురనియు నీకుఁ దెలిసినదియే. వారెల్ల రాముని తోఁ యుద్ధముచేయఁబోవ నారాముఁ డొక కఠినవాక్యము నేని వచింపక ధనుర్విద్యానైపుణ్యమున నొక్కఁడే వారినెల్ల మ్రందఁ జేసెను. దండకారణ్యవాసుల నిపు డారాముఁడు నిర్భయులను గావించెను. తండ్రి రాజ్యమునుండి పాఱఁ దోలఁగా భార్యం గూడి వచ్చిన క్షత్రియవంశపాంసనుఁ డగు నారాముఁడు మృతి చేరువకు రాఁగా నాపక్షమున నుండు వారల రూపుమాపెను. ఆతనివృత్తి దుష్టము. హృదయము కఠినము.ఆతఁడు మహాక్రూరుఁడు, లుబ్ధుఁడు, విషయలోలుఁడు నగు. అధర్మాచరణపరాయణుఁడు. ప్రాణిహింసయం దాతనికిఁ బ్రీతి మెండు. వైరము లేకున్నను ధర్మమునుగూడ లెక్కింపక తనబలమునే నమ్మి యడవిని నాసోదరి ముక్కును జెవులను

* ఇది ముప్పదాఱవసర్గమునఁ గలదు.

ఖండించెను. విరూపనుగాఁ గావించెను. అట్టి యాక్రూరుని గృహిణి నచ్చరంబోలు నందగత్తైను సీతను జనస్థానమునుండి విక్రమించి తేవలయుననియే యున్నవాఁడను. ఆపనికి నీవు తోడుపడవలయు. నీవు నాతమ్ములు తోడుగనుండఁగా రణరంగమున దేవతలంగూడ లెక్క పెట్టనుగాదే. కాన నీ విపుడు తోడుపడుము. సమర్థుఁడవని నే నెఱుఁగుదును. వీర్యదర్ప యుద్ధముల నీకు సరిపోల్పఁ దగువాఁ డెవ్వఁడు గలఁడు? సర్వోపాయములు నీహస్తగతములు. మాయాసర్వస్వవేత్తవు. ఇందులకే నీకడ కేతెంచితిని. నీవు తోడుచూపఁ దగువిధ మెఱిఁగించెదను. ఆలకింపుము.

వెండిచుక్కలు సొగసుగాఁ గనంబడ నొకబంగారుజింక వలె నగపడవలయు. ఆరూపమున నీవా శ్రీరామునాశ్రమము నకు నరిగి జానకియెదుట విహరింపుము. బంగారుజింకగనున్న నిన్ను నాసీత చూచినంతన దీనిని బట్టియిమ్మని శ్రీరాముని లక్ష్మణుని నడుగును. వా రుభయులు నాయాశ్రమమునుండి దానిం బట్టఁబోవఁగనే యెవ్వరులేని యా యాశ్రమమునుండి యేయంతరాయము లేక చంద్రప్రభను రాహువు గ్రహించు నట్లు సీత నపహరించెదను. అంత రాముఁడు భార్యావిరహమునఁ బరితపించి కృశించిపోవును. ఆవల నతఁడు యుద్ధమునకు వచ్చినను నిస్సంశయముగా నాతనిం గొట్టుదు. అను నీ మాటలు విన్నయంతనే మహాబలుఁడైనను మారీచుఁడు నోరెండఁగా వడఁకెను. పెదవులెండఁగా నాఁకుకొనుచు నిలింపుఁడై శవమువలెఁ గనంబడుచు నార్తుఁడై రావణుని జూచెను. ముందే రామునిపరాక్రమము నాతనికిఁ జెప్పి యున్నాఁడు కావున రామునిమాట మరలఁ జెవిఁబడఁగాఁ

ద త్తఱంపడుచు నంజలి గీలించి రావణుం గాంచుచు నాతనికిఁ దనకును హితము కల్గించునట్లు మాటలాడఁ బూనెను.

మహాశయులారా! ఈభాగమున విశేషాంశములు గలవు. వానిం దెలిసికొందము. రావణుఁడు తన జీవితమెఱిం గిన ప్రోఢయే కాని కేవలమూర్ఖుఁడు కాఁడని మహేశ్వర తీర్థు లనువ్యాఖ్యానకర్త భావము. అవివేకుఁడని గోవింద రాజుల భావము. ఉత్తరరామాయణమున సీతనివిషయము స్పష్టము కాఁగలదు. కాన నాకాండము వాల్మీకిరచితమే కాదని గోవిందరాజులభావ మనవచ్చును. మహాజ్ఞాని యనియే నే నూహించువాఁడను. కాన నామతము ననుసరించిన మహే శ్వరతీర్థులయాశయము నిందు వ్రాయుచున్నాఁడను. రావ ణుఁడు కేవలాజ్ఞుఁడే యగుననువారల నీ రామాయణభాగము బాధింపకమానదు.

"తేన సంజాతరోషేణ రామేణ రణమూర్ధని. ౭
అనుక్త్వా పరుషం కించిచ్ఛరైర్వ్యాపారితం ధనుః,
చతుర్దశసహస్రాణి రక్షసాముగ్రతేజసామ్. ౮
నిహతాని శరైస్తీక్ష్ణై ర్మానుషేణ పదాతినా,
ఖరశ్చ నిహతస్సంఖ్యే దూషణశ్చ నిపాతితః. ౯
హతశ్చ త్రిశిరాశ్చాపి నిర్భయా దండకాః కృతాః."

అని కదా మూలము. ఒక్క కఠినవాక్యమైన వెడలనీయక తీవ్రబాణముల నెల్లర మహాబలు లగురక్కసుల రాముఁడు వధించెను. అనఁగా భావమేమి? రామచంద్రుఁడు తన్ను వధింప నవతరించెనని యెఱింగినవాఁ డనియే కాక మఱే మగును? శత్రువును వంచింపఁబూని తనబంధువుతో వానిం

బొగడువాఁడును గలఁడా! ఈరీతిగా స్తుతించుట రామాయణ మునం దందందుఁ జూపట్టును. ఆయాసమయముల దానిని విస్తరించి వ్రాయుదు. దీనింబట్టి రావణుఁడు వివేకసంపన్నుఁ డనియే స్పష్టమగును. సనత్కుమారుఁడు బోధార్థియై వచ్చిన రావణునకుఁ దెలిపినవిధము నుత్తరకాండమున మన మూహింతుమేని రావణుఁడు తన చావును గోరియే దుష్కార్యములు చేయఁజొచ్చెననియు, శాపాంతమును నిరీక్షించువాఁ డనియుఁ దోఁపకపోదు. విరోధమున శాపవిముక్తి శీఘ్రముగ నగునని కదా భగవంతుఁ డొసఁగిన వరము. ఈవిషయమును భాగవతమే బోధించును గాదే. భగవత్సేవ చేయువారలు జన్మాంతర మునందు నించుక జ్ఞానధనము కలవారుగా నందురనియే నా విశ్వాసము. ఉత్తరకాండము వాల్మీకికృతమే కాదనుచో గాయత్రీమంత్రసమ్మిళితము రామాయణ మనుమాట యెగిరి పోవును. కాన నుత్తరకాండము వాల్మీకిప్రోక్తమనియే విశ్వ సింపవలయును. అందే శ్రీరామసేవాఫలము భక్తులకెల్లఁ గలిగెననువిషయము కలదు. అది లేనిచో లాభ మేమి? ఇఁక రావణుఁ డెటేంగియే శాపవిమోచనార్థ మీ దుష్కార్యము నాచరించెనని మనము గ్రహింపవలయును. దాని ననుసరించి వ్రాసిన పెద్దలభావము నరయుదము.

"పిత్రా నిరస్తః క్రుద్ధేన సభార్యః క్షీణజీవితః. ౧౦
స హంతా తస్య సైన్యస్య రామః క్షత్రియపాంసనః,
దుశ్శీలః కర్కశ స్తీక్ష్ణో ఽమూర్ఖో ఽలుబ్ధోఽజితేంద్రియః. ౧౧
త్యక్తధర్మో హ్యధర్మాత్మా భూతానా మహితేఽరతః."

అని మూలము. ఈమాటలధోరణిం బట్టి చూడఁగా వాల్మీకి

హృదయ మేమని తోఁపకపోదు. రెండర్థము లగునట్టు లేల యీవాక్యము లుండవలయును? వాల్మీకిభావ మేమని యరసిన, రావణుఁడు జ్ఞానియనియే అనువారలకును, వాఁడు కేవలమూర్ఖుఁడే యనువారలకును దగినయట్లు వ్రాయుటయే యని తోఁపకపోదు. ఇందుఁ బ్రాతీతికార్థము స్పష్టమే. విశేషార్థ మరయం దగినది. "పిత్రా క్రుద్ధేన నిరస్తః కిమ్" అని యన్వయము. కిమ్మనునది ప్రకరణార్థబలమున నధ్యాహార్యము. క్రోధమునఁ దండ్రిచేఁ దఱుమఁబడ లేదని భావము. కైక కొసంగినవరముల మూలమున సత్యపాశబద్ధుఁడై యడవులకుఁ బంప సమ్మతించెననియుఁ, దండ్రిమాట వెడలినదే తడవుగఁ దన యవతారఫలము లోకమునకుఁ గల్గింప బయలుదేరె ననియు సారము. "సభార్యః సభాయా మార్యః. సభ్యః క్షీణ జీవితః కిమ్" అని యన్వయము. సభాపూజ్యుఁ డగుపరమేశ్వరుఁడు జీవితము క్షీణించినవాఁ డగునా? కాఁడని భావము. సభయం దగ్రపూజ్యుఁడగు పరబ్రహ్మము క్షీణజీవితుఁడు కాఁడనియే సారము. "తస్య ఖరస్య సైన్యస్య సంహర్తా. క్షత్రియాన్ పాతీతి క్షత్రియపః. సచాసావంసనశ్చ శత్రునాశకః. అంస సమాఘాత ఇతి ధాతుః. అత ఏవ దుశ్శీలః కిం? కింతు సద్వృత్తః." అని యన్వయము. ఖరసేనలఁ జంపినవాఁడు. ఏల? అనఁగా క్షత్రియులను బాలించువాఁడు. శత్రువుల సంహరించువాఁడు. అట్టివాఁడు దుశ్శీలుఁ డగునా? కాఁడు. సద్వృత్తుఁడే యని భావము. ఖరసేనలు ధర్మధ్వంస మొనర్చునవి. కాన వానిం దునుమాడెను. క్షత్రియులను బాలించువాఁడు. అనఁగా "క్షతాత్త్రాయతే క్షత్రః తస్యాపత్యం క్షత్రియః." అను వ్యుత్పత్తిననుసరించి క్షత్రియకుమారుఁడు శత్రుధ్వంసకుఁ డగుట

సహజమే కాని దానిచే దుశ్శీలుఁ డనఁబడఁడు. సుశీలుఁడే యగునని సారము. కర్కశః = కఠినుఁడు. అనఁగా శత్రువుల యందు మృదువుగా వర్తింపరాదు. కనుకఁ గఠినుఁడే యగు నని భావము.

"స్వరాష్ట్రే న్యాయవృత్తస్స్యాద్భృశదండశ్చ శత్రుషు,
సుహృత్స్వజిహ్మస్స్నిగ్ధేషు బ్రాహ్మణేషు క్షమాన్వితః." అధ్యా-౭. ౩౨

అను మనుస్మృతివాక్యముచొప్పున శత్రువులవిషయమునఁ గఠినుఁడుగ నుండుట న్యాయమే యని సారము. తీక్ష్ణః = కార్యములయం దలసుఁడు కాఁడని యర్థము. కనుక, అమూర్ఖః = మూర్ఖుఁడు కాఁడు. అలుబ్ధః = పేరాసకలవాఁడు కాఁడు. జితేంద్రియః = ఇంద్రియములకు లోఁబడువాఁడు కాఁడు. త్యక్తధర్మః=క్షత్రియవిరుద్ధధర్మములను వదలినవాఁడని యర్థము. కనుక, అధర్మాత్మా కిమ్=ధర్మాత్ముఁడు కాఁడా యేమి? ధార్మికుఁడే యని భావము. ఇట్టివాఁడు కనుకనే భూతానా మహితే అరతః=భూతముల కపకారముచేయు నుత్సాహము లేనివాఁడు. అని రావణుని భావము. మారీచుఁ డీయర్థమును గ్రహింపఁజాలెనా యనరాదు. మృతి సమీపించుచున్నందున రావణునిభావమును విపరీతముగనే గ్రహించెనని మన మెఱుంగవలయును. ఈయర్థము పైశ్లోకమునకు విరుద్ధము కాదా యందు రేమో వినుఁడు.

"యేన వైరం వినారణ్యే సత్త్వమాశ్రిత్య కేవలమ్. ౧౨
కర్ణనాసాపహరణా ద్భగినీ మే విరూపితా."

అని మూలము. విశేషార్థ మిద్ది యని గ్రహింపఁదగు. ఏరాము మూర్తి విరోధము లేక కేవల మనస్సు నాశ్రయించి యనఁగా

దానికర్మమున కనుగుణ మగుఫలము నిచ్చునూహ నాశ్రయించి యని భావము. ముక్కుచెవులు కోసి నాతోఁబుట్టువు విరూపిణిగాఁ జేయఁబడినది. ఈయర్థము ముందు వచింపఁబోవు భావమునకు విరుద్ధము కాదా యన్నఁ గాదు. ఎట్లు? అనఁగా

"తస్య భార్యాం జనస్థానాత్సీతాం సురసుతోపమామ్. ౧౩
ఆనయిష్యామి విక్రమ్య సహాయస్తత్ర మే భవ."

అని కదా మూలము. భార్యాం=తేజోవంతురాలు. అనఁగాఁ దేజస్స్వరూపిణి. సురసుతోపమామ్ = దేవకన్యవంటిది. సురశబ్దప్రయోగముచేఁ బూజ్యత్వము తోఁచెడిని. పూజ్యురాలగు, సీతామ్ = అయోనిజయగు మహాప్రకృతిని అని భావము. "జనస్థానాద్విక్రమ్య ఆనయిష్యామి." తెగించి జనస్థానమునుండి లంకకుఁ దీసికొనిపోయెదను. నీవు తోడుపడుము. సనత్కుమారుని హితోపదేశము ననుసరించి భగవంతుఁడగు శ్రీరామునివలన మృతినొంది యథాపూర్వపదము నొందఁగోరి యామహాత్మునిచ్ఛాశక్తియగు ప్రకృతిని మహాలక్ష్మిని దేఁ బ్రయత్నించుచున్నాను. నీ వకార్యమునకుఁ దోడుపడుమా యని రావణునియాశయము. "త్యక్తధర్మః" అను చోట "త్యక్తాః విరుద్ధాః ధర్మాః యేన సః." అని యెట్లు సమాసము చెప్పవలయునని కొందఱు ప్రశ్నించిరి. "జనార్దనః" అనుచోట "జనాః శత్రుజనానర్దయతీతి జనార్దనః." అనుట యెట్టిదో యిదియు నట్టిదే యని సమాధానము.

ఈభావముగలవాఁడు కనుకనే రావణుఁడు పౌరుషమున కిది కాలముకాదని యెంచి యిట్లు పలుకుచున్నాఁడు.

నేనడుగలేదే. నే నొకకార్యము నీకుఁ దెల్పితిని. పరాక్రమవంతుఁడవుగాన దానిఁ జేయవలయును. బదులు పలుకరాదు. ఆకార్యము నాలకింపుము.

మారీచా! వెండిచుక్కలుగలిగిన బంగారుజింకవలె నగపడుచు నారామునాశ్రమమున కరిగి సీతమ్రోలఁ దిరుగుము. సీతకు నీపై మిక్కిలి యాదరణము కల్గఁజేయుము. ఆవల నీ యిచ్చుచొప్పునఁ బొమ్ము. స్వర్ణమృగరూపుఁడవగు నిన్నుం గాంచినంతనే యాజానకి యచ్చెరువంది దానిం దెచ్చి యిమ్మని రాము నడుగఁగలదు. నిన్నుంబట్టి నారాముఁ డాసీతను వదలి వచ్చినవెంటనే నీవు దూరముగాఁబోయి శ్రీరామునిమాటలే యని తోఁచునట్లుగా 'హాసీతా! హాలక్ష్మణా!' యని గట్టిగాఁ బలుకుము. ఆధ్వని విన్నంతనే సౌమిత్రి యేమియుందోఁపక సీతయుం బ్రోత్సహింపఁగా రామునిజాడనుబట్టిపోవును. అత్తఱి నొంటరిగానున్న జానకిం దెచ్చెదను. ఈపని యిట్లు చేసి యవల నీయిచ్చవచ్చినచోటి కరుగుము. ఇందులకు నారాజ్యమున నీకు సగమిత్తును. మృగరూపమున దండకారణ్యమున కరుగుము. రథమునెక్కి నీవెంట నేనును వత్తును. రాముని వంచించి జానకి నపహరించి మరల నిన్నుంగూడి లంకకుం బోవుదు. దీనిం జేయననిన నిన్నిందే వధింతును. బలాత్కారముననైన నీచే నీపనిని జేయింతును. రాజప్రతికూలున కేతఱినైన సుఖము కలుగదు కదా. నీవు రామునికడ కేగినఁ బ్రాణములు నిల్చిన నిలువచ్చును. నాతో విరోధింతువేని మృతిమాత్రము తప్పదు. ఇఁక నీవే యాలోచించుకొని యేది యిందు మంచిదియో యద్దాని నొనరింపుము.

మహాత్ములారా! ఇందును విశేషములు గలవు. పరికింతము.

"మారీచేన తు తద్వాక్యం క్షమం యుక్తం నిశాచరః,
ఉక్తో న ప్రతిజగ్రాహ మర్తుకామ ఇవౌషధమ్." ౧

అని మూలము. రావణునిచిత్తవృత్తిని వాల్మీకి దీనిమూలమున వెల్లడించెను. "చావఁబూనుకొనువాఁడు మందును బుచ్చుకొనని యట్లు" అను నుదాహరణమునుబట్టి యాలోచించిన, మరణమునే కోరుచున్నవాఁడు రావణుండనియు, సీతాహరణము దానికి సాధనమగునని తలంచెననియు, హితమగుమారీచుని వాక్యసముదయము నక్కారణముననే యంగీకరింపకపోయె ననియుఁ దేలుచున్నది. రావణుఁడు మూర్ఖుఁడు కాఁడని భగవంతునివలన మృతినొందఁ గోరియే యిట్లు లోనరించె ననియు నిందుఁ గలసారము.

"అబ్రవీత్పరుషం వాక్య మయుక్తం కాలచోదితః. ౨
యత్కిలైతదయుక్తార్థం మారీచ మయి కథ్యతే,
వాక్యం నిష్ఫలమత్యర్థ ముప్తం బీజమివోషరే." ౩

అని మూలము. కాలచోదితుఁ డనఁగా "కాలో హి భగవాన్" అన్నన్యాయము ననుసరించియు, "లోకానామంతకృత్కాలః" అను సౌరోపనిషద్వాక్యము ననుసరించియు,

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయంత్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అను గీతాశాస్త్రవాక్యము ననుసరించియు నాలోచింపఁగా, భగవంతుఁడు కర్మఫలము ననుభవింప రావణుని బ్రోత్సహింపఁగా నతఁడు తద్వశుఁడై మారీచునిహితవాక్కుల నంగీకరింపక

పోయె నని భావము. కనుకనే యుక్తార్థము నయుక్తార్థము నుగా భావించెను. మారీచా! నీమాట నిరర్థకము సుమీ యని పలుకఁజాలెను. నీ కెంత హితముగా నయ్యది తోఁచినను జవుటి నేల నాటిన విత్తనమువలె నాకది రుచింపదనియెను. అనఁగా నాయం దది ఫలింపఁజాలదని భావము. దీనింబట్టి నెట్టన యూహింపఁగ నొక్కవిశేషము తోఁచెడిని. గురువు మంచి శిష్యుని వెదకి యతని పరిశుద్ధహృదయమునందు మంత్రబీజమును నాటిననే యది ఫలించుననియు, లేకున్న నాయుపదేశము నిరర్థకమనియుఁ దేలెడిని.

"న దేయం పరశిష్యాయ దేయం వత్సరవాసినే."

అన్న సూక్తి ననుసరించి యొకసంవత్సరము పరీక్షించి యతని హృదయక్షేత్రము మంచిదని యెఱింగియే యుపదేశింప వలయు ననియు,

"న శఠాయ న దుష్టాయ నావిశ్వాసాయ కర్హిచిత్."

అను న్యాయము ననుసరించి దుర్వృత్తున కుపదేశింపరాదనియు సిద్ధాంతితమగుచున్నది. మధ్వవైష్ణవాదులు కొందఱు వేషధారులు ధనార్జనమునకై మంత్రోపదేశము చేయుదురు. వారి హృదయభావము పరీక్షించుటకు నవకాశ మెక్కడిది? రజత ముద్రికను బాదములకడ నుంచినంతనే తమ కనుభవములేక యెందో చూచి వ్రాసికొన్న మంత్రము నుపదేశింతురు. అ యిరువుర కయ్యది నరకమునే కల్గించును.

"అనేకగురవస్సంతి శిష్యవిత్తాపహారకాః."

అన్న సూక్తి యెల్ల రెఱింగినదియే కాని క్రొత్తది కాదు కదా గురువు సచ్ఛిష్యుని సంపాదించి వానిఁ దరింపఁజేయ మంత్రో

దేశము చేయవలయు. అట్టి సద్గురువును శిష్యుఁడు, అట్టిసచ్ఛిష్యుని గురువు సంపాదించుకొనవలయు ననియు నప్పుడే యయ్యది ఫలించుననియు నిందలిసారము.

రావణమారీచు లిరువురును శ్రీరామప్రభావము నెఱింగినవారే యని స్పష్టమయ్యెను. రావణుఁడు సనత్కుమారుని యుపదేశము నాలకించి తనవధమునకై భగవంతుఁ డెపుడవతరించునా యని కోరుచుండెను. ఇపు డావాంఛ నెఱవేఱినట్లయ్యె. శీఘ్రమ శరీరనివృత్తికిఁ దగునుపాయము సీతాపహారణమే యని నిశ్చయించుకొనియె. మారీచునితోఁ దనభావ మెఱుకపడకయుండ సంభాషింపఁబూనెను. ఆవాగ్ధోరణిని బరికింపుఁడు. రావణుఁడు కేవల మూర్ఖుఁడనుభావమును వదలి రామాయణమును బఠింపందగు.

"యస్త్యక్త్వా సుహృదో రాజ్యం మాతరం పితరం తథా,
స్త్రీవాక్యం ప్రాకృతం శ్రుత్వా వనమేకపదే గతః. ౫
అవశ్యం తు మయా తస్య సంయుగే ఖరఘాతినః,
ప్రాణైః ప్రియతరా సీతా హర్తవ్యా తవ సన్నిధౌ. ౬
ఏవం మే నిశ్చితా బుద్ధిర్హృయి మారీచ వర్తతే,
న వ్యావర్తయితుం శక్యా సేంద్రైరపి సురాసురైః." ౭

అని మూలము. విశేషార్థ మేమనఁగా: "ప్రకృతిసంబంధి ప్రాకృతం. స్త్రీవాక్యం." త్వరపడి పల్కిన దని యర్థము. ఇఁక క్షణమైన నాలస్యము చేయక వెడలవలయునన్న వాక్యమని భావము. దాని నాలకించి యనఁగాఁ దనయవతారఫలమును లోకమునకుఁ గలిగించునది యని యర్థము. దాని నెఱింగి సర్వమును వదలి యడవులఁ జేరెను. ఖరఘాతినః = కఠినాత్ముల

పోయె నని భావము. కనుకనే యుక్తార్థము నయుక్తార్థము నుగా భావించెను. మారీచా! నీమాట నిరర్థకము సుమీ యని పలుకఁజాలెను. నీకెంత హితముగా నయ్యది తోఁచినను జవుటి నేల నాటిన విత్తనమువలె నాకది రుచింపదనియెను. అనఁగా నాయం దది ఫలింపఁజాలదని భావము. దీనింబట్టి నెట్టన యూహింపఁగ నొక్కవిశేషము తోఁచెడిని. గురువు మంచి శిష్యునివెదకి యతనిపరిశుద్ధహృదయమునందు మంత్రబీజమును నాటిననే యది ఫలించుననియు, లేకున్న నాయుపదేశము నిరర్థకమనియుఁ దేలెడిని.

"న దేయం పరశిష్యాయ దేయం వత్సరవాసినే."

అన్నసూక్తి ననుసరించి యొకసంవత్సరము పరీక్షించి యతని హృదయక్షేత్రము మంచిదని యెఱింగియే యుపదేశింప వలయు ననియు,

"న శఠాయ న దుష్టాయ నావిశ్వాసాయ కర్హిచిత్."

అను న్యాయము ననుసరించి దుర్వృత్తున కుపదేశింపరాదనియు సిద్ధాంతితమగుచున్నది. మధ్వవైష్ణవాదులు కొందఱు వేష ధారులు ధనార్జనమునకై మంత్రోపదేశము చేయుదురు. వారి హృదయభావము పరీక్షించుటకు నవకాశ మెక్కడిది? రజత ముద్రికను బాదములకడ నుంచినంతనే తమ కనుభవములేక యెందో చూచి వ్రాసికొన్న మంత్రము నుపదేశింతురు. ఈ యిరువుర కయ్యది నరకమునే కల్గించును.

"అనేకగురవస్సంతి శిష్యవిత్తాపహారకాః."

అన్నసూక్తి యెల్ల రెఱింగినదియేకాని క్రొత్తది కాదు కదా. గురువు సచ్ఛిష్యుని సంపాదించి వానిఁ దరింపఁజేయ మంత్రోప

హింసించునట్టి యారామునకుఁ బ్రాణాధికురాలయిన యా జానకి, తవ సన్నిధౌ = నీయెదుట, హర్తవ్యా = అపహరింపఁ దగినదే. అనఁగా మహాప్రకృతి పురికొలుపఁగాఁ దాను జేయఁ దగిన దిది కదా యని యెంచి పురములోనగువానిని వదలి యడవులకే తెంచిన శ్రీరామునిప్రాణేశ్వరిని దొంగిలికొనిపోయె దను. నీవు చూచుచుండుము. ఈయాలోచనము శతమఖ ప్రముఖదేవతలు కూడ మరలింపఁజాలరు. పగవారగుదేవతలు కూడ నామేలు గోరి వాస్తవ మెఱుంగక యీపని మాను మన్నను మానుకొనను. నాకు రానున్న ఫలమును వారెఱుంగరు కాన వారిమాటలు విశ్వాసపాత్రములు కావు. కాన నీవు నాయానతి నెఱవేర్పుమని రావణుఁడు తెలిపెననియే యిందలిసారము.

“దోషం గుణం వా సంపృష్టస్త్వమేవం వక్తుమర్హసి,
అపాయం వాప్యుపాయం వా కార్యస్యాస్య వినిశ్చయే. ౯
సంపృష్టేన తు వక్తవ్యం సచివేన విపశ్చితా,
ఉద్యతాంజలినా రాజ్ఞే య ఇచ్ఛేద్భూతిమాత్మనః. ౧౦
వాక్యమప్రతికూలం తు మృదుపూర్వం హితం శుభం,
ఉపచారేణ యుక్తం చ వక్తవ్యో వసుధాధిపః. ౧౧
సావమర్దం తు యద్వాక్యం మారీచ హితముచ్యతే,
నాభినందతి తద్రాజా మానార్హో మానవర్జితం.” ౧౨

అని మూలము. వాల్మీకిమహాముని రావణునివాక్యములమూలమున లోకులకు మాటలాడుపద్ధతిని దెల్పుచున్నాఁడు. ఈ కార్యము నెట్లు చేయుమనుదువని తన్నడిగినయెడలఁ దోఁచి నది చెప్పవలయును. అడుగనిదానిం బలుకరాదు. ఎంతమిత్త్రున

కైన నడుగనితటి నాలోచనము తెలుపరాదు. అట్లు తెలిపిన మర్యాదపోవును. అడిగిన నుత్తరము చెప్పవలసినపద్ధతి యెట్టి దనఁగాఁ బ్రతికూలముగాఁ దోఁపరాదు. మృదువుగా నుండ వలయు. హితముగా నుండఁదగు. శుభముగ నుండవలయు. మర్యాదను దెలుపుచుండవలయు. తిరస్కారయుతమయ్యెనేని యది హితమైనను అంగీకరింపరు. ఇది నేర్చుకొనవలసిన విషయము.

"సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయా దేష ధర్మస్సనాతనః. ౧౩౮
భద్రం భద్రమితి బ్రూయాద్భద్రమి త్యేవ వా వదేత్,
శుష్కవైరం వివాదం చ న కుర్యా త్కేనచిత్సహ. ౧౩౯
క్షత్రియం చైవ సర్పం చ బ్రాహ్మణం చ బహుశ్రుతం,
నావమన్యేత వై భూష్ణుః కృశానపి కదాచన. ౧౩౫
ఏతత్త్రయం హి పురుషం నిర్దహేదవమానితం,
తస్మాదేతత్త్రయం నిత్యం నావమన్యేత బుద్ధిమాన్." ౧౩౬
మను. ౪-అధ్యా.

అను నీమనుస్మృత్యర్థమే రామాయణమునందుఁ గలదు. రామాయణము సమయానురూపముగా ధర్మములను బ్రవృత్తి మార్గము లోనగువానిని దెల్పుచుండును. కావున మనము దానింబఠించునపు డట్టివిశేషముల నెఱుంగవలయును. కథ మాత్రము తెలిసికొన్నఁజాలదు.

"తస్మాత్సర్వాస్వవస్థాసు మాన్యాః పూజ్యాశ్చ పార్థివాః." ౧౩

అని మూలము. ఈయర్థమునే విస్తరించి,

"బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి భూమిపః,

మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి. ౮
యస్య ప్రసాదే పద్మా శ్రీర్విజయశ్చ పరాక్రమే,
మృత్యుశ్చ వసతి క్రోధే సర్వతేజోమయో హి సః.” ౧౧

మను. ౭-అధ్యా.

అను మనుస్మృతి తెలుపుచున్నది. మానవప్రవర్తనముఁ జక్కఁగాఁ జేయుమార్గములెల్ల రామాయణమునఁ గలవు.

“త్వాం తు మాయామృగం దృష్ట్వా కాంచనం జాతవిస్మయా,
ఆనయైనమితి క్షిప్రం రామం వక్ష్యతి మైథిలీ. ౧౯
అపక్రాంతే తు కాకుత్స్థే దూరం యాత్వాప్యుదాహర,
హా సీతే లక్ష్మణేత్యేవం రామవాక్యానురూపకం. ౨౦
తచ్ఛ్రుత్వా రామపదవీం సీతయా చ ప్రచోదితః,
అనుగచ్ఛతి సంభ్రాంతస్సౌమిత్రిరపి సౌహృదాత్.” ౨౧

అని మూలము. ఇయ్యది రావణుని స్థిరభావమును దెలుపుచున్నది. భావికార్యము లిట్లు జరగునని రావణుఁ డెట్లు లెక్కింగెను? ఒక్కయక్షరమైనఁ దప్పకయుండనట్లే కార్యము సాగెను గదా. మూర్ఖుఁడే రావణుఁడైన నట్లే సాగుట కేమి హేతువు? సనత్కుమారునిహితోపదేశము మది నాటుటం జేసి శ్రీరాముఁడు తనకొఱకే యవతరించె నని నమ్మెను. వేదవేదాంగపారంగతుఁ డగురావణుఁడు తదనురూపముగాఁ బ్రవర్తించెను. బుద్ధిబలమున రాఁగల కార్యగతుల నూహించెను. దీనిం బట్టి యాలోచింపఁగా, రావణుఁడు కాముకుఁడై సీతను గొనిపోవలేదనియుఁ, దన్మూలమునఁ దనకు మృతి గల్గుననియే కొనిపోయె ననియు మన మెఱుంగవలయును. కనుక రామాయణము పఠించునపుడు కామాంధుఁడే యని భావించి దూషింప

రాదు. "త్వాం తు మాయామృగం దృష్ట్వా" అనునది రావణునియూహను దెలుపును. మోసపుమృగమని చూచి యనఁగా భావమేమి? దానితత్త్వమును జానకి యెఱుంగుననియే కదా. అదెట్టు లందు రేమో. "మైథిలీ" యనుపదమును మహాకవి ప్రయోగించెను. మహాజ్ఞానియగు జనకరాజుకూఁతురు. "జాతవిస్మయా"అనునది యీభావమునకు బాధకము కాదాయందు రేని కాదు. "జాతవిస్మయేవ" అని యూహింపవలయును. ఆనయైన మితి శీఘ్రం=త్వరగా దీనిని దెచ్చియిమ్మని రాముసకుఁ దెలుపును. ఈజోస్యము రావణునకుఁ జక్కఁగాఁ దెలియును. త్రికాలజ్ఞుఁడగు సనత్కుమారుఁడు బోధించెను. ఆమహాత్ముని మాట తప్పదన్న నమ్మకము గలుగుటంబట్టి తనమృతిని గోరియే యతఁడు మారీచుని నిర్బంధించెనని మనము తెలిసికోనవలయును. రామలక్ష్మణు లింట నుండరనునంతదనుక రావణుఁడే తెల్పెను. విశేషించి సీతయే లక్ష్మణుని బురికొలుపుననియు వెల్లడించెను.

**"ఆసాద్య తం జీవితసంశయ స్తే మృత్యుర్ధ్రువో హ్యద్య మయా విరుధ్య,**
**ఏతద్యథావత్పరిగృహ్య బుద్ధ్యా యదత్ర పథ్యం కురుత త్తథా త్వం." ౨౭**

అని మూలము. శ్రీరామునికడ కరిగితివేని బ్రదుకు సంశయము. పోవకున్న నాచేత మృతి తప్పదు. ఈ రెండువిషయములు చక్కఁగా నూహించి నీకేది హితమని తోఁచునో యట్టులొనర్పుము. అని రావణుఁడు మారీచునకుఁ దెలిపెను. అనఁగా మాయామృగరూపధారివగు మారీచుఁడ వని యెఱింగినను శ్రీరాముఁడు శరణాగతపరిత్రాణబిరుదాంచితుఁడు కరుణానీరధియుఁ గావున నిన్నుఁ జంపక వదలినను వదలును. నేను మాత్రము వదలను జుమీ. కాన మాయిరువురిలో నెవరి

మూలమునఁ జావుకల్గిన మంచిదో యోజింపుకొమ్ము. అనియే కదా రావణుని భావము.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్." ౙ౯

అను గీతావాక్యముచొప్పున భగవంతుఁడు తప్పుచేసినవారు ప్రార్థించినను దండింపక వదలును. ఏలయనఁగా నతనికి విరోధియే లేఁడు. నేనట్టివాఁడను గాను జుమీ. నిన్నుఁ జంపక వదలను. నామనోరథములం దీర్పు శ్రీరామునితోఁ బగగల్గినఁ గాని నాకుఁ దరణోపాయము లేదు. ఇట్టి మహాలాభము నాకుం గల్గనుండఁగా దానికిఁ దోడ్పకయున్న నీకంటె నాకుఁ బగవాఁ డెవఁ డుండును? కాన వదలక వధింతునని భయపెట్టెను. మారీచుఁడు తనచావు తప్పదని యెఱింగిన నయ్యది భగవంతునిమూలముననైన మంచిదికదా యని నిర్ణయించుకొని మాయామృగమై రామునాశ్రమమునకే పోవు ననునదియే రావణునిసిద్ధాంతము. ఇట్టివాఁడు మూర్ఖుఁ డనుటకంటె మూర్ఖత్వ మేమి యున్నది? ఈవిషయమున నధ్యాత్మ రామాయణమునఁ గలవిశేష మేమి యని పరికింతము.

"అతః పరం చేద్యతిక్రమంచిద్భాషసే మద్విభీషణం,
హనిష్యామ్యసినానేన త్వామత్రైవ నసంశయః.
మారీచస్తద్వచశ్శ్రుత్వా స్వాత్మన్యేవానుచింతయత్,
యది మాం రాఘవోహన్యాత్తదాముక్తోభవార్ణవాత్.
మాం హన్యాద్యదిచేద్దుష్ట స్తదామే నిరయో ధ్రువం,
ఇతి నిశ్చిత్య మరణం రామాదుత్థాయవేగతః." ౬-సర్గము.

అను నీమూలము శ్రీరామాయణార్థమునే తెలుపుచున్నది.

రావణునిహృదయ మిదియే కదా. రాముని మూలమున మరణముగల్గిన సంసారార్ణవమునుండి తరింపఁగల్గుదును. రావణునిచే మృతిగల్గునేని నరకమునఁ బడుదును. అని మారీచుఁడు తలంచెను. దీనిహృదయ మేమి? భగవంతుఁడే రాముఁడను పేర నున్నవాఁడు. ఆపరమేశ్వరునిచే మృతిగల్గినఁ దరింతును. అనఁగా మృతికాలమున భగవంతుఁడే నన్ను వధించె నన్న యూహ కుదిరినందున ముక్తియే లభించును. రావణుఁడు క్రూరుఁడుకాన నతనిచే మృతి గల్గునేని దుర్మరణము గల్గెనన్న విచారము కల్గును. కాన నాతలంపు ప్రకారమే దుర్గతి కలుగును. అనునదియే మారీచుని నిశ్చయము.

"అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫
యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. ౬
తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ,
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః. ౭
అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. ౮

ప్రయాణకాలే మనసాచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ,
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్య
క్సతం పరం పురుషముపైతి దివ్యమ్." ౧౦

గీత. ౮-అధ్యాయము.

అను నీభగవద్గీతాతాత్పర్య మీరామాయణభావమును దృఢపఱచుచున్నది. ఇందొక్కవిశేషము కలదు. అంతకాలమునఁ

గలుగు స్మృతి కర్మానుసారముగ నుండును. సర్వకాలముల యందు నన్నే స్మరించుచుండుము. మనోబుద్ధుల నాయందే యర్పింపుము. అభ్యాసబలమునఁ జిత్తము నాయందే నిలిచి యుండును. కావున నంతకాలమున నాస్మృతియే కలుగును. అను శ్రీకృష్ణునుపదేశము కర్మసిద్ధాంతమునకు విరుద్ధము కాదా యని ప్రశ్నింపవచ్చును. విరుద్ధ మెప్పటికిని గాదు. సత్కర్మముల నాచరించినవారలకే యట్టి యభ్యాసము చేయు నూహ కలుగును. అట్టియూహ కలిగి యది దృఢమూల మగు నేని ఫలింపకపోదు. ఫలించుననుటయే సిద్ధాంతము. అట్టిమనో నిశ్చయము కలుగుటకే యోగాభ్యాసము ముఖ్యమని భగవంతుఁడు తెలిపెను.

"అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా."

అనఁగా నర్థమేమి? అలవాటు యోగమని కొందఱు. అభ్యాస మనఁగా నేమని విచారింతము.

"తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే. ౧౨
సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్. ౧౩
ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. ౧౪
యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి. ౧౫
... ... ... ...
శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. ౨౫

యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం,
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్. ౨౬
యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యంతం సుఖమశ్నుతే." ౨౮

గీత. ౬-అధ్యా.

అను నీగీతావాక్యములు యోగాభ్యాసమును దెలుపుచున్నవి సుఖాసనమునఁ గూరుచుండి యాత్మవిశుద్ధికొఱకు యోగము. నభ్యసింపవలయును. తోఁచినట్లు కూరుచుండరాదు. దేహము శిరస్సు కంఠము సమముగా నుండునట్లు కూరుచుండవలయును. కదలరాదు. నాసికాగ్రముననే చూపు నిలుచునట్లు చేయవలయును. అనఁగా సగముకన్నులను మూయవలయునని యర్థము. అట్లైనఁగాని దృష్టి నాసికాగ్రమున నిలువదు. ముక్కు చివరభాగముననే చూడుమనుట యేల? అనఁగా నందు భగవంతుఁ డుండునని కాదు. అలవాటుకొఱకే యని తెలిసికొనవలయును. ఆయలవాటు బాగుగ నెఱవేఱినపిదప నభీష్టదేవతాకల్పితమూర్తినిజూడవలయును. ఇది గీతావాక్యములకు విరుద్ధము కాదా యందురేమో కాదు. గీతాతాత్పర్యమదియే. ఎట్లు?

"భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్స తం పరం పురుషముపైతి దివ్యమ్."
అను గీతావాక్యం బరిశీలింపుఁడు.

"పూర్వం హృదయపుండరీకే వశీకృత్య చిత్తం తత ఊర్ధ్వగామిన్యా నాడ్యా భూమిజయక్రమేణ భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య స్థాపయిత్వా సమ్యగప్రమత్తస్సన్ స ఏవం విద్వాన్ యోగీ 'కవిం పురాణ' మిత్యాది లక్షణం తం పరం పరతరం పురుషముపైతి ప్రతిపద్యతే. దివ్యం ద్యోతనాత్మకమ్."

అని శంకరభాష్యము. శంకరాచార్యులమతము సమయమత మనంబడు. సమయమత మనఁగా ఆంతరపూజారతి యని యెఱుంగవలయు.

"భగవత్పాదాచార్యాస్సమయమతపారదృశ్వానః సమయాచారప్రవణాస్సమయరూపాం స్తువంతి. సమయాచారో నామ ఆంతరపూజారతిః కులాచారో నామ బాహ్యపూజారతిః ఇతి రహస్యమ్."

అని సౌందర్యలహరివ్యాఖ్య.

"అతస్సమయినో నామ సమయపూజకాః తేషాం షట్చక్రపూజాసు నియతా ఆసక్. సహస్రకమల ఏవ పూజా. సహస్రకమలపూజా నామ సహస్రకమలస్య బైందవస్థానత్వేన తన్మధ్యగతచంద్రమండలం చతురశ్రాత్మనా తన్మధ్యబిందుం పంచవింశతితత్త్వాతీతం షడ్వింశాత్మకశివశక్తిమేళనరూపసాదాఖ్యాత్మనా అనుసంధానం. అత ఏవ సమయిమతే బాహ్యారాధనం దూరత ఏవ నిరస్తం. షోడశోపచారాంగకలాపశ్చ తతోఽపి దూరత ఏవ. తథాహి, ఆధారాదిషట్చక్రాణాం త్రికోణాదిషట్చక్రత్వేన తాదాత్మ్యం. బిందుస్థానస్య చతురశ్ర సహస్రకమలత్వేన తాదాత్మ్యం బిందుశివయోస్తాదాత్మ్యం. ఏవం దేవీశివయోస్తాదాత్మ్యమితి తాదాత్మ్యత్రయం చక్రమంత్రయోరైక్యం పూర్వమేవోక్తమితి. తేన చతుర్థైక్యం సమయినాం సమారాధనమితి మహద్రహస్యం. అత్ర కించిదుచ్యతే, సమయినాం చతుర్విధైక్యానుసంధానమేవ భగవత్యాస్సమారాధనమిత్యేతత్సర్వం సమ్మతమ్."

అని సౌందర్యలహరివ్యాఖ్య. దీని సారమేమి? శాక్తమతమే యోగమతము. శాక్తు లిరుదెఱంగుల నుందురు. బాహ్యపూజానిరతులు. ఆంతరపూజానిరతులు. బాహ్యపూజానిరతులే కౌళమతావలంబకులు. ఆంతరపూజానిరతులే సమయా

చారనిరతులు. సమయాచారమే యోగమతము. సహస్రారకమలమునందు శివశక్తుల కభేదత్వము నెఱింగి వారిని ధ్యానించుటయే శాక్తము. దానికే సమయాచారమని పేరు. యోగమతము నిదియే. ఇంచుకంతయు భేదము లేదు. బాహ్యపూజ యోగమతమున నీచము. దానిని దూరముగాఁ ద్రోసివేయవలయును. ప్రకృతిపురుషుల కభేదమని నమ్మి యాయిరువురు తేజోరూపమున సహస్రారకమలమున నుందురని భావించి ధ్యానయోగమున వారి నుపాసింపవలయుననుటయే శాక్తమత సిద్ధాంతము. యోగమత మింతకన్న రవంతయు భేదముకలది కాదు. బాహ్యపూజానిరతు లగు కౌళమతమువారు శాక్తులలోఁ బామరులు. కాని బాహ్యపూజ పనికిరా దనరాదు. అయ్యది ధ్యానమునకు సాధన మగును. సర్వకాలము బాహ్యపూజయే ప్రధానమని చేయుచుండువారు జ్ఞానహీనులే యనవలయు. వారియందును బామరులే దేవాలయములు ముఖ్యము లనువారు. వారివిషయము వదలుదము. యోగమతమే శాక్తమని వ్రాసితిని గదా. దానికి ధ్యానమే ముఖ్యము. అదియు విగ్రహరూపమునఁ బ్రకృతిపురుషైక్యమును ధ్యానింపక తేజోరూపమును ధ్యానింపవలయునని తెలియవలయును. ఈవిషయమునే భర్తృహరి వైరాగ్యశతకమునందు

"ధన్యానాం గిరికందరే నివసతాం జ్యోతిః పరం ధ్యాయతా
మానందాశ్రుజలం పిబంతి శకునా నిశ్శంకమంకేశయాః,
అస్మాకం తు మనోరథోపరచితప్రాసాదవాపీతట
క్రీడాకానన కేళికౌతుకజుషామాయుః పరం క్షీయతే." ౧౦౨

అని తెలిపెను. పరంజ్యోతిని ధ్యానించుటయే యోగమతమని కదా భర్తృహరిభావము. ధ్యాన మనఁగా

సూ. "తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్." ౨
పాతంజలదర్శనము-విభూతిపాదము.

"యత్ర ధారణావిజాతీయవృత్తిపరిహారే యత్నాపేక్షా భవతి తత్ర ఏవ యా ప్రత్యయానాం వృత్తీనామేకతానతా యత్నమనపేక్ష్యైకవిషయతా తత్ ధ్యానమ్ ఇత్యర్థః." అని మణిప్రభ.

ధారణాస్థలమునందు జ్ఞానముయొక్క ధ్యానేతరవస్తువులను జిత్తమునందుఁ జేరనీయక యుండునట్లు చేయుటయే ధ్యానమనంబడునని యర్థము. అనఁగా ధ్యానించువస్తువునకంటే వ్యతిరిక్తమైనదానిని మనస్సున రానీయక ధ్యానించువస్తువునే భావించుటకే ధ్యానమని పేరు. ఈస్థితి యమనియమాదులు సిద్ధింపనివారికిఁ గలుగదు.

"ధ్యానముచ్యతే. తత్ర దేశే ధ్యేయాకారవృత్తిప్రవాహో వృత్త్యంతరావ్యవహితో ధ్యానమ్. యథా హృత్పుండరీకాదౌ చతుర్భుజాదిచింతనమ్. బుద్ధివృత్తౌ వా తద్వివేకతశ్చైతన్యచింతనం కారణోపాధౌ చేశ్వరచింతన మితి. ఈశ్వరగీతాయా మప్యేతదేవోక్తం. 'దేశావస్థితిమాలంబ్య బుద్ధేర్యా వృత్తిసంతతిః, వృత్త్యంతరైరసంస్పృష్టా తద్ధ్యానం సూరయో విదుః.' ఇతి. ధ్యానసమాధ్యోరపి కాలనియమ ఉక్తఏవేతి ధ్యానముక్తమ్."
అని విజ్ఞానభిక్షుకృతయోగసారసంగ్రహము. ౨-అంశము.

ఈవిషయమునే గీతాశాస్త్రము సంగ్రహముగా "భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్" అని సూచించెను. పైనుదహరించిన యోగశాస్త్రములసార మేమనఁగా సాధకుఁడభీష్టదేవతను నిర్మలజ్యోతిస్స్వరూపునిగా నెంచి మనోదృష్టిచే దానినే చూచుచు వేఱొకవిషయమునందు మనస్సును బ్రవేశింపనీయకుండుట యనియే. విషయాంతరమును మనస్సు

స్పృశించునేని ఆధ్యానము వ్యర్థము. అట్లు వేఱొకవిషయము నందు మనస్సు ప్రవేశింపక యుండఁజేయుటకే యోగాభ్యాసము ముఖ్యమయ్యెను. ఎన్ని వేదాంతోపన్యాసములు చెప్పినను యోగాభ్యాసము లేక మనస్సు స్థిరతం గాంచదు. అది కుదురకయున్న నీయుపన్యాసములు నిష్ఫలములే యగును. ఆయోగాభ్యాస మెల్లర కొక్కరీతిగా నుండదు. వారివారి యోగ్యత ననుసరించి యుండును. పూర్వజన్మమున యోగాభ్యాసము చేసి యది యాజన్మమున ఫలింపక మరల జన్మమెత్తినవారలకు శీఘ్రకాలమున ఫలించును.

"ప్రాప్య పుణ్యకృతాన్ లోకానుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. ४०
అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశం. ४२
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం,
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునందన. ४३
పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. ४४
ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిం. ४५
తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున. ४६
యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః." ४७

భగవద్గీత. ౬-అధ్యా.

ఈ గీతాశాస్త్రవాక్యములే పైని వ్రాసినయభిప్రాయమును సిద్ధాంతము చేయుచున్నవి. బుద్ధితెలిసినదిమొద లెవ్వానికి యోగాభ్యాసమునందే యభిప్రాయము కలుగునో వాఁడు పూర్వజన్మమున నాకృషి యొనరించి సిద్ధిని గాంచఁజాలక జన్మించెనని మన మెఱుంగవలయును. కపటయోగులు కొందఱున్నవారు కదా. వా రట్టివారు కానేకారు. ధనార్జనలోలుపత్వమున నట్టివేషములను వేయుదురు. వారికి దుర్గతియే ఫలము. యోగి నిస్సంగుఁడు కావలయును గదా. శిష్యకూటమును జేర్చుకొనుచు దానికిఁ దగినయుపాయముల నెమకుచు దేవుఁడు కనఁబడి యీవేషము వేయుమనెనని పామరులకుఁ దెలుపుచుఁ గన్నులు మూయుచు "శ్రీరామా! శంకరా! పరమాత్మా!" యని వంచకుఁడై నుడువుచు నుండువాఁడు భోగి గాక యోగి యగునే. ఏనాఁటికిని గాఁడు. వంచకసార్వభౌముఁడగు నాపాపాత్మునకు భగవంతునకు నెంతదూరము? పాషాణములు మాత్రము కనంబడును. అట్టివారే మఱుజన్మమునఁ దత్ఫలము ననుభవింప వియోనులయందు జన్మింతురు.

పైనుదాహరించిన గీతాశాస్త్రమున నొక్కవిశేషము కలదు. దానిం దెలుపక మానరాదు. "తపస్విభ్యోఽధికో యోగీ" అను వాక్యమునందుఁ గలతపస్విలనుపదమునం గనంబడు తపస్సనఁగా భావమేమి?

"కాయేంద్రియసిద్ధి రశుద్ధిక్షయా త్తపసః." ౪౩

పాతం. సాధనపాదము.

"స్వధర్మకృచ్ఛ్రచాంద్రాయణాదినా క్లేశపాపక్షయాత్కాయస్థాణిమాదిసిద్ధి రింద్రియాణాం దూరసూక్ష్మార్థగ్రాహ్యత్వసిద్ధిర్భవతి."

మణిప్రభ.

తప స్సానరించుటచేతఁ జిత్తమునందుఁ గలమాలిన్యము తొలఁగుచున్నది. దానిచే జ్ఞానేంద్రియములకుఁ గర్మేంద్రియములకు విశేషశక్తి కలుగుచున్నది. అనఁగాఁ జాంద్రాయణాదికవ్రతము లాచరించుటం జేసి చిత్తము నిర్మలినమగు. పరిశుద్ధచిత్త మనఁబడును. దానిచేఁ దనదేహమును స్వేచ్ఛగా అణురూపముగఁ గాని మహారూపముగఁగాని యుండునట్లు చేసికొనుశక్తి కలుగును. అంతియకాక యెదుటనుండు సూక్ష్మ సూక్ష్మతర సూక్ష్మతమవస్తువులను, చాటున నుండువస్తువులను గనంబడునట్లు చేసికొనుసామర్థ్యము కలుగును. అని భావము. తపస్సనఁగా నేమని విచారింతము. తపః వైధక్లేశజనకం కర్మ. యథా.

"ఉమేఽతి చపలా పుత్రి! న క్షమం తావకం వపుః,
సోఢుం క్లేశస్వభావస్య తపసస్సౌమ్యదర్శనే."

మత్స్యపురాణవచనమ్.

"తపోభిః ప్రాప్యతేఽభీష్టం నాసాధ్యం హి తపస్యతః,
దుర్భగత్వం వృథా లోకో వహతే సతి సాధనే.

తత్రైవ-

బ్రాహ్మణస్య తపోమూలం యజ్ఞస్స్వాధ్యాయ ఏవ చ,
తస్మాదగ్నే ఫలం బ్రూహి తపసోఽధ్యయనస్య చ.

వహ్నిరువాచ:—

స్వాధ్యాయతపసోర్వృత్త్యై తస్మై నిగదితం శృణు,
తపసో హి పరం నాస్తి తపసా విందతే మహాత్.
తపసా క్షీయతే పాపం మోదతే సహ దైవతైః,
తపసా ప్రాప్యతే స్వర్గ స్తపసా ప్రాప్యతే యశః.

... ... ... ...

తస్మాత్స్వధర్మసంయుక్తో నిత్యం సిద్ధ్యతి పండితః,
ధర్మాత్సుఖమవాప్నోతి ఇహలోకే పరత్ర చ."

వహ్నిపురాణే - అని శబ్దకల్పద్రుమము.

"శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే. ౧౭
సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్. ౧౮
మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్." ౧౯

భగవద్గీత. ౧౭-అధ్యా.

"తప్యతే తాపయతి వా. తప ఉపతాపే, సంతాపే చ." అని వ్యుత్పత్తి" చాంద్రాయణాదివ్రతములు తప స్సనఁబడునని దీనిసారము. ఆగమమున దీని భావమేమి? మునులు లోనగు వారు చేయునది తపస్సని పురాణప్రసిద్ధము. తపోవనములని వినుచుందుము కదా. జనసమ్మర్దములేని ప్రదేశమునందు (విశేషించి యయ్యది మనఃక్లేశమును గల్గింపనితావునందు) నివసించి యభీష్టదేవతామూర్తిని మదిని ధ్యానించుచు గురూపదిష్టస్వకార్యసాధనక్షమమంత్రము నాకర్షణబీజసంయుతముగ జపించుచుండుట తప స్సనంబడును. ఆమంత్రమున సంపుటము చేయఁబడిన బీజాక్షరప్రభావమున నభీష్టదేవతాహృదయము స్నేహవంత మగును. తపస్సు తీవ్రరూపమును దాల్చినకొలంది నాతఁడు త్వరపడి భక్తునికిఁ గనఁబడ నుంకించు. దానికే తపఃఫలమని పేరు. సాధకునివాంఛితము తత్ఫలానుభవమునకుఁ దగినదైన ననుకూలవరముల నొసంగుదేవత పోవును. లేనిచో నావరములు ప్రతికూలములై బాధాకరములు నగు. ధ్రువా

దులకు భగవంతుఁడు సాక్షాత్కరించె నని పురాణముల మూలమున మన మెఱుంగుదుము కదా. ఉపాసకుఁడే తపస్వి యనంబడును. వాంఛల ననుసరించి యాతపస్సు సాత్త్వికమని రాజసమని తామసమని పిలువంబడును. శరీరమును మనస్సును శోషింపఁజేయుట తపస్సుపని యనవచ్చును. దానిచేత నింద్రియ సుఖములపైని గలకోరికలు నశించునని ప్రాచీనులమతము. తగ్గినను దగ్గును. వృద్ధియైన నగును. అది వారివారికర్మాధీనముగ నుండును. తపస్సనఁగా నిష్టదేవతోపాసనమనియే దీనిసారము. ఈతపస్సు యోగాభ్యాసమున మనస్సు స్థిరతం గాంచినఁగాని సంపూర్ణఫలము నీయఁజాలదు.

"తపోమూలమిదం సర్వం దైవమానుషకం సుఖం,
తపోమధ్యం బుధైః ప్రోక్తం తపోంతం వేదదర్శిభిః. ౨౩౪
బ్రాహ్మణస్య తపోజ్ఞానం తపః క్షత్రస్య రక్షణం,
వైశ్యస్య తు తపోవార్తా తపశ్శూద్రస్య సేవనం. ౨౩౫
ఋషయస్సంయతాత్మానః ఫలమూలానిలాశనాః,
తపసైవ ప్రపశ్యంతి త్రైలోక్యం సచరాచరం. ౨౩౬
ఔషధాన్యగదో విద్యా దైవీ చ వివిధా స్థితిః,
తపసైవ ప్రసిద్ధ్యంతి తపస్తేషాం హి సాధనమ్. ౨౩౭
యద్దుస్తరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుష్కరం,
సర్వంతు తపసా సాధ్యం తపోహి దురతిక్రమం. ౨౩౮
మహాపాతకినశ్చైవ శేషాశ్చాకార్యకారిణః,
తపసైవ సుతప్తేన ముచ్యంతే కిల్బిషాత్తతః. ౨౩౯
కీటాశ్చాహిపతంగాశ్చ పశవశ్చ వయాంసి చ,
స్థావరాణి చ భూతాని దివం యాంతి తపోబలాత్. ౨౪౦

యత్కించిదేనః కుర్వంతి మనోవాఙ్మూర్తిభిర్జనాః,
తత్సర్వం నిర్దహంత్యాశు తపసైవ తపోధనాః. ౨౪౧

తపసైవ విశుద్ధస్య బ్రాహ్మణస్య దివౌకసః,
ఇజ్యాశ్చ ప్రతిగృహ్ణంతి కామాన్ సంవర్ధయంతి చ. ౨౪౨

ప్రజాపతిరిదం శాస్త్రం తపసైవాసృజత్ప్రభుః,
తథైవ వేదానృషయ స్తపసా ప్రతిపేదిరే. ౨౪౩

ఇత్యేత త్తపసో దేవా మహాభాగ్యం ప్రచక్షతే,
సర్వస్యాస్య ప్రపశ్యంత స్తపసః పుణ్యము త్తమమ్." ౨౪౪

మను. ౧౧-అధ్యా.

అను నీ మనుస్మృతివాక్యములం బట్టి యోజింపఁగాఁ దపస్సు ప్రధానమనియే తోఁచును. కాని యోగము ప్రధానమని తోఁపదని కొందఱందురు. "ఋషయస్సంయతాత్మానః" అను శ్లోకమునందుఁగల "సంయతాత్మానః" అనునది యోగాభ్యాసము చేసినవారు తపస్సానరింప నర్హులని తేలెడిని. మనోనిగ్రహము లేనితపస్సు నిష్ఫలమనుటకు శాస్త్రప్రమాణము చూపనక్కఱలేదు కదా. ఏదియో గురుదత్తమంత్రోపాసనమే తపస్సని తేటపడుచున్నది. అది యోగమూలమని సిద్ధాంతితమగుచున్నది. భగవంతుఁడు "తపస్విభ్యః జ్ఞానిభ్యః కర్మిభ్యశ్చాధికో యోగీ" అని తెలిపెనుగాని వేఱొకతావుననైన గీతాశాస్త్రమునందు "యోగిభ్యశ్చాధికో జ్ఞానీ తస్మాత్ జ్ఞానీ భవార్జున" అని తెలుపలేదు. ఏల? మనోనిగ్రహములేని వేదాంతోపన్యాసములు నిరర్థకములని. ఆ మనోనిగ్రహము యోగమునఁగాని కలుగదని. అట్టియోగము ప్రధానమని భగవంతు నాశయమని చెప్పక తప్పదుకదా. అద్దాని నించుక

వ్రాయక గ్రంథవిస్తరభీతి నొంది విషయాంతరమును దడవుట న్యాయము కాదు. కావునఁ బామరులకొఱకు సంగ్రహించి వ్రాసెదను.



## యోగాభ్యాసపద్ధతులు.

"తత్ర తావద్యోగద్వయసాధారణం దృష్టం ఫలం సంప్రజ్ఞాతస్య వృత్తినిరోధేన వృత్త్యర్థదుఃఖభోగనివృత్తిః, అదృష్టం చ ఫలం సంప్రజ్ఞాతస్య పూర్వోక్తద్వారైర్ధ్యేయసాక్షాత్కారః, క్షీణవృత్తేరభిజాతస్యేవ మణేర్గ్రహీతృగ్రహణగ్రాహ్యేషు తత్స్థతదంజనతా సమాపత్తిరితి సూత్రాత్ తతశ్చావిద్యాదక్లేశనివృత్త్యా మోక్షః, తథాసత్యాం కామనాయాం భూతేంద్రియప్రకృతిజయోత్థః స్వేచ్ఛాలోకగతిశ్చ భవతి, అసంప్రజ్ఞాతస్య త్వదృష్టం ఫలం తత్త్వజ్ఞానసాధారణానామఖిలసంస్కారాణాం ప్రారబ్ధకర్మణాం చ దాహాచ్ఛీఘ్రం స్వేచ్ఛయా మోక్షః"

విజ్ఞానభిక్షుకృత యోగసారసంగ్రహము.

అసంప్రజ్ఞాతుఁడనఁగా, "న కించిత్సంప్రజ్ఞాయతేఽస్మిన్నితి వ్యుత్పత్త్యా అసంప్రజ్ఞాతయోగస్సర్వవృత్తినిరోధః. తదా సంస్కారమాత్రశేషం చిత్తం తిష్ఠతి." అను విజ్ఞానభిక్షువాక్యము ననుసరించి సర్వవృత్తినిరోధమని యర్థము తేలెడిని. సంప్రజ్ఞాతా=సంప్రజ్ఞాతయోగములను రెండు తెఱంగులలో దుఃఖభోగనివృత్తియు, ధ్యేయసాక్షాత్కారము, అవిద్యాదిక్లేశనివృత్తి మూలమున మోక్షము గలుగును. ఇదియే యోగఫలము. జ్ఞానమునఁ గలుగుఫలము ముక్తియే కదా. జ్ఞానవిరహిత యోగము యోగవిరహితజ్ఞానము ఈ రెండును పనికిరావనియే భావము.



సూ. "తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః." ౧౩

"తత్ర తయోర్మధ్యే రజస్తమోవృత్తిశూన్యస్య చిత్తస్యైకాగ్రతా స్థితిః. తస్యాం కార్యాయాం యాని సాధనాని యమనియమాదీని త ద్విషయః యత్నః అనుష్ఠానం అభ్యాసః." ఇత్యర్థః.

రామానందయతికృతమణిప్రభ.

సూ. "స తు దీర్ఘకాల నైరంతర్యసత్కారా సేవితో దృఢభూమిః." ౧౪

అను నీ సూత్రముల ననుసరించి చిరకాల మభ్యసింపఁ దగు ననియు, యమనియమాదిసాధనములమూలమునఁ గాని యది సిద్ధింపదనియు భావ మేర్పడుచున్నది. ఈశాస్త్రము నుదాహరించుచు విమర్శింపఁబూనినఁ జాలగ్రంథము పెరుగును. లఘు మార్గమును దెలిపెదను. యోగాభ్యాస మెల్లరకు నొక్కవిధముగ నుండ వలనుపడదు. హఠయోగప్రదీపికయం దీవిధము విస్తరింపఁబడినది. గృహస్థులుమొదలు యతులవఱకు నెల్లరకుఁ బ్రాణాయామయోగము చెప్పఁబడినది. దాని నభ్యసించిన యోగసిద్ధి కలుగునని శాస్త్రము ఘోషించుచున్నది. ఆ ప్రాణాయామము నాల్గువిధములుగ నుండును.

నారదీయే:—

"రేచకః పూరకశ్చైవ కుంభకశ్శూన్యక స్తథా,
ఏవం చతుర్విధః ప్రోక్తః ప్రాణాయామో మనీషిభిః.
జంతూనాం దక్షిణా నాడీ పింగళా పరికీర్తితా,
సూర్యదైవతకా చైవ పితృయోనిరితి స్మృతా.
దేవయోనిరితి ఖ్యాతా ఇడానాడీ తు వామగా,
తత్రాధ్యదైవతం చంద్రః శృణుధ్వం గదతో మమ.
ఏతయో రుభయోర్మధ్యే సుషుమ్నానాడికా స్మృతా,
అతిసూక్ష్మా గుహ్యతమా జ్ఞేయా సా బ్రహ్మదైవతా.

వామేన రేచయే ద్వాయుం రేచనాద్రేచక స్స్మృతః,
పూరయే ద్దక్షిణేనైవ పూరణా త్పూరకస్స్మృతః.
స్వదేహే పూరితం వాయుం నిగృహ్య న విముంచతి,
సంపూర్ణకుంభవత్తిష్ఠే త్కుంభకస్సహి విశ్రుతః.
న గృహ్ణాతి త్యజతిన వాయుమంతర్బహిస్థితం,
జ్ఞేయం తచ్ఛూన్యకం నామ ప్రాణాయామం యథాస్థితమ్."

"అస్మిం శ్చతుర్విధప్రాణాయామే సూత్రకారేణాయం విశేష ఉక్తః. ఆదౌ యత్సహితం త్రయమభ్యస్యతే తచ్చ దేశకాలసంఖ్యాభిరవధృతం భవతి తదా దీర్ఘసూక్ష్మసంజ్ఞకం భవతి. తత్ర రేచకస్య దేశో నాసికాగ్రాద్బహిర్ద్వాదశాంగుళాదిః. స చ ఈషికా తూలాదిక్రియయా నిశ్చేయః. స చ పిపీలికాస్పర్శతుల్యస్పర్శేన నిశ్చేయః. కుంభకస్య రేచకపూరకయోర్బాహ్యాభ్యంతరదేశౌ సముచ్చితావేవ విషయః. ఉభయత్రైవ ప్రాణస్య వృత్తినిరోధాత్. సచోక్తలింగద్వయానుపలబ్ధ్యా నిశ్చేయః,............ఏవమభ్యాసక్రమేణ యదా దేశకాలసంఖ్యాభిరపరిచ్ఛేద్యౌ రేచకపూరకౌ వినైవ మాససంవత్సరాదిస్థాయీ బహుదేశస్థాయీ కుంభకో భవతి స కేవలకుంభకశ్చతుర్థః ప్రాణాయామః. తస్మిన్ సతి ఆకాశగమనాదిసిద్ధయో జాయంతే. తదుక్తం వసిష్ఠసంహితాయామ్:—

రేచకం పూరకం త్యక్త్వా సుఖం యద్వాయుధారణం,
ప్రాణాయామోఽయమిత్యుక్త స్సవై కేవలకుంభకః.
సహితం కేవలం వాపి కుంభకం నిత్యమభ్యసేత్,
యావత్కేవలసిద్ధిస్స్యాత్తావత్సహితమభ్యసేత్.
కేవలే కుంభకే సిద్ధే రేచపూరకవర్జితే,
న తస్య దుర్లభం కించిత్త్రిషు లోకేషు విద్యతే."

ఈప్రాణాయామ మగర్భమని సగర్భమని రెండువిధములు.

నారదీయే:—

"అగర్భశ్చ సగర్భశ్చ ద్వితీయస్తు తయోర్వరః,
జపధ్యానం వినాఽగర్భ స్సగర్భస్తత్సమన్వితః.

జపమంత్ర ఈశ్వరగీతాయాముక్తః.

సవ్యాహృతికాం సప్రణవాం గాయత్రీం శిరసా సహ,
త్రిర్జపేదాయతప్రాణః ప్రాణాయామస్స ఉచ్యతే."

"కేవల ప్రాణాయామజపోఽయం పరమహంసానాం, ధ్యానం చ రేచకపూరకాదిక్రమేణ నాభిహృదయలలాటేషు బ్రహ్మవిష్ణుశివరూపాణాం స్మృతిషూక్తం. పరమహంసానాంతు కేవలమేవ బ్రహ్మధ్యేయముక్తం. 'ప్రణవేన పరబ్రహ్మ ధ్యాయీత నియతో యతః' ఇత్యాదిస్మృతిభిరితి దిక్."

యోగసారసంగ్రహము. ౨-అంశము.

"ద్వావేవ ధత్తస్సకలం చ కాలం దివాకరః కైరవబాంధవశ్చ,
భోక్త్రీ సుషుమ్నా సకలస్య చాస్య కాలస్యదోషాదివసాత్మకస్య. ౨౨
తతః క్రమేణైవ విశుద్ధనాడీ పథాంతరః ప్రాణసమీరణస్య,
శనైశ్శనైస్సంయమనే ప్రయత్నం యథావిధానం విదధీత ధీరః. ౨౩
శీతాంశుమార్గేణ శనైస్సమీరమాపూరయేత్స్వోదరమాదరేణ,
వికారమాత్రాభిరపేతతంద్రః కాలాగ్నిమూలార్పితచిత్తవృత్తిః." ౨౪
(కాలాగ్నిమూలే మూలాధారే. అని వ్యాఖ్య.)

"తతో ధారయేన్మారుతం శుద్ధచేతాశ్చతుష్షష్టిమాత్రాస్సమాపూరితం తత్,
బహిర్భాస్వతా రేచయేన్మందమేనం తదర్ధాభిరంతర్నిరుద్ధంతు తాభిః.
విపరీతమతో విదధీత బుధః పునరప్యథ తద్విపరీత మితి,
అమునా విధినా సమనాస్సతతం మరుతో విదధీతస్వనయమనమ్. ౨౬
ప్రస్వేదం జనయతి యః ప్రాణాయామేషు సోఽధమః ప్రోక్తః,
కల్పోమధ్యః పుంసాం భూమిత్యాగం తనోత్తనోతి పరః. ౨౭

తావద్విదధీత బుధః ప్రాణాయామం సమాహితో విధివత్,
యావత్సంభవతి భువి ప్రాణాయామస్యోత్తమస్య గుణః. ౨౮
అయం ప్రాణాయామస్సకలదురితధ్వంసనకరో
విగర్భః ప్రోక్తోఽసౌ శతగుణఫలో గర్భకలితః,
జపధ్యానాపేత స్సతు నిగదితో గర్భరహితః
సగర్భస్తూన్ముక్తో మునిపరివృతై ర్యోగనిరతైః. ౨౯
శుచిః ప్రాణాయామాన్ ప్రణవసహితాన్ షోడశవశీ
ప్రభాతే సాయం చ ప్రతిదివస మేవం వితనుతే,
ద్విజో యస్తం భ్రూణప్రహరణకృతాఘాభికలితం
పునంత్యేతే మాఽసాదిహ దురితతూలౌఘదహనాః. ౩౦

... ... ... ...

ఇహ రేచకపూరకౌ విహాయ స్థిరధీః కుంభకమేవ కేవలం యః,
సతతం కురుతే మనోజవత్వం లభతే వీతజరామయస్స మర్త్యః. ౩౧
వర్షత్రయాభ్యాసవశాదతీత మనాగతం వేత్త్యవినీలకేశః,
విషం న దేహాక్రమతే తదీయే దష్టేసుఘోరై రపి పన్నగేంద్రైః.''౮౩
త్రిపురాసారసముచ్చయము. 3-పటలము.

ఈ శాస్త్రముల సారమేమి? ప్రాణాయామయోగమే శ్రేష్ఠము. వాయునిరోధమే యోగహృదయము. ఇది చిత్తవృత్తుల నిరోధించునని యడుగువా రుండకమానరు. సగర్భమని అగర్భమని యది రెండువిధములు. వాయునిరోధమే కుంభకము నాఁబడు. ఒక్కమంత్రమును మనస్సునఁ దలంచుచుఁ దదధిదేవతారూపమును భావించి చిత్తము నద్దానియందు సంక్రమింపఁ జేయవలయు. కుంభకమునకు ఫల మదియే. అయ్యది చిరకాల మభ్యాసము కాఁగాఁ జిత్తమొకలక్ష్యమున నిలుచును. మంత్ర

ధ్యానరహిత మగునది అగర్భ మనఁబడు. అది చిత్తైకాగ్రతకు హేతువు కాఁజాలదు. కాన సగర్భమనునదియే శతగుణాధిక ఫలప్రదమని యోగులుపలికిరి. వాయునిరోధమనునది స్వేచ్ఛగాఁ జేయరాదు. హృదయభాగమును వామహస్తతలమున నదిమి పట్టి చంద్రనాడీమార్గమునను సూర్యనాడీమార్గమునను పూరకము రేచకము చేయవలయును. అదియు నియమబద్ధము కావలయును. పూరక రేచకములు సమానకాలముగలవిగ నుండవలయును. కుంభకము పూరకమునకుఁ దక్కువపక్షమున మూఁడింతలుగ నుండందగు. వరుసగా నయ్యది పదాఱురెట్లు కావలయు. పదాఱుసారులు మంత్రమును మనసున నుచ్చరించుచుఁ బూరకముచేసి అఱువదినాలుగుసారు లామంత్రమునే మనస్సున నుచ్చరించుచు నంతకాల మొకలక్ష్యమును గాంచుచు వాయువును గుంభకము చేయవలయు. దానిచేఁ దేహ మాయాసపడరాదు. చెమ్మటబిందువులు పొలయరాదు. అది యపాయమును గల్గించును. చాలకాల మిట్లుచేయఁగాఁ గుంభకమే యలవడును. అది పరమహంసకుఁ బ్రధానము. ఇతరులకుఁ బనికిరాదని కాదు. ఆయోగ మలవాటుపడిన యెడల నాయోగికి లభింపనిసిద్ధులే లేవు. త్రికాలవేతృత్వము కలుగును. భయంకరోరగములు కఱచినను విషమాదేహమున వ్యాపింపఁజాలదు. ప్రతినాడియు వాయునిరోధమున విషము నిరోధింపఁజాలియుండును. కాని యీయోగము వాయునిరోధమాత్ర మయ్యెనేని ఫలింపదు. చిత్తము కుంభకకాలమున నభీష్టదేవతాతేజోరూపమున లగ్నము కావలయును. అదియే యభ్యాస మనంబడునది.

"శనైః శ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్."

అను నీగీతావాక్యతాత్పర్య మిదియే. యోగాభ్యాసము మాత్రము గురుప్రసాదము లేకయుండఁ జేయరాదు. కొందఱు కద్దానిచే నొకపక్షముపడిపోవును. కొందఱు కెన్ని యో మరల్ప రానివ్యాధులు కలుగును. కావునఁ గొంతకాల మలవడినంత దనుక గురువుకడ నుండవలయును.

"యా ముండాధారదండాంతరవివరగతాహారనీహారగౌరీ
సాధ్వీం ధారాం నభోంభోరుహకుహరవిధోస్సంస్రవంతీ వహంతీ,
తస్యా వజ్రాఖ్యనాడ్యాః ఖగముదరదరీ మధ్యగం యోవిదధ్యా
త్తస్యా బ్రహ్మాండభాండప్రళయమపఘనం స్యాద్ఘనం మృత్యుమప్ర
మూర్ఛ్యాం గతో హరతి రోగసమూహమధ్యా [శ్లోః.
రుద్ధః కరోతి ఖగనే గమనం నరాణామ్,
వాతో మృతో వితనుతే ఒమరతాం సమస్త
మభ్యాసతస్సులభమేవ సమీరణస్య." ౪౬

త్రిపురాసార. 3-పటలము.

యోగి యెంతకాలమైన నాహారము లేకయుండునని పురాణములు ఘోషించును. ఆతని దేహ మక్షయముగా నుండును. సర్పములు ప్రాఁకుచున్న నతఁడు చలింపఁడు. అనఁగా లక్ష్యము నందే చిత్తము నిలిచియుంచును. ఆహార మెట్లని ప్రశ్నింప రాదు. సుషుమ్నా నాడీగతసుధాధారలే యతని కాహార మగును. ఈవిషయమే శ్రీశంకరభగవత్పాదులచే నీరీతిగాఁ దెల్పఁబడినది.

"సుధాధారాసారైశ్చరణయుగళాంతర్విగళితైః
ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయమహసః,
అవాప్య స్వాం భూమిం భుజగనిభమధ్యుష్టవలయం
స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణి." ౧౦

"శిరస్థితచంద్రమండలం సర్వయోగశాస్త్రసిద్ధం. తత్తు సమయినాం మతే శ్రీచక్రమేవ. అతశ్చ శిరస్థితసహస్రకమలాంతర్గతశ్రీచక్రాత్మక శశిబింబమధ్యస్థితాయా భగవత్యాశ్చరణకమలనిర్ణేజనజలైః సుధామయైః సాధకస్య సకలం శరీరం సంప్లావ్య పునర్భుజగరూపేణాధారకుండం ప్రవిశ్య సుషుమ్నామవష్టభ్య సా భగవతీ స్వపితీతి."

"భుజంగాకారరూపేణ మూలాధారసమాశ్రితా,
శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాశుభా.
(అశుభా క్షణప్రభా విద్యున్నిభేత్యర్థః.)
మూలకందం ఫణాగ్రేణ దృష్ట్వా కమలకందవత్,
ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమన్వితా."

అని వ్యాఖ్య. ఇదంతయు భావనయే కదా. భావన యనఁగాఁ దదాకారధ్యానమని యెఱుంగవలయును. యోగాభ్యాసమునకు విశేషతేజస్సుగలతావు పనికిరాదనుట యోగులే యెఱుంగుదురు. ఇతరులకుఁ జుట్టు దీపములున్న మంచిదని తోఁచును. అది బాహ్యపూజానిరతులకు నానందజనకమైనను గాకున్నను ప్రేక్షకు లగుపామరుల కానందజనక మగును. ఇతరుల వంచించుటయే కదా డాంబికులకుఁ బ్రధానముక్తి. అదియే ధనము నాకర్షించుమంత్రము.

ఈయోగము ఫలమును గోరి చేసిన ఫలింపదు. ఫలాభిసంధిరహితముగ నొనరించిననే ఫలించును. తనంతట ఫలము

గలిగినఁ గలుగవచ్చును. తదనుభవమునఁ గూడ సాధకుఁడు నిస్పృహుఁడే కావలయు. ఎవ్వని మనస్సున నీశ్వరుఁడు సర్వత్ర నిండియున్న వాఁ డనువిశ్వాసము కుదురునో యతఁడే యోగాభ్యాసమున కర్హుఁడు. శిష్యులం జేర్చుకొని ఛాయాపటములు తీయించుకొనుటకు ముక్కు చెవులును బిగించుకొనువారు కపటయోగులు. వారికి లాభము ధనరూపమే యని యెఱుంగనలయును. మారీచుఁ డిట్టియోగము నభ్యసించుచున్న వాఁడు కావుననే

"యది మాం రాఘవో హన్యాత్తదా ముక్తో భవార్ణవాత్."

అని భావించెను. కావున మారీచుఁడు రావణుఁడు శ్రీరాముఁడు భగవంతుఁ డనియు, దుష్టరాక్షససంహారము కొఱకే యవతరించెననియు, ధర్మము స్థాపించుటయే యీయవతారఫలమనియుఁ, బరమాపరమేశ్వరునిమూలమున మృతి గల్గుట మేలనియు భావించిరని మనము తెలిసికొనవలయును. ఇఁకఁ బర్వోపకథను బఠింతము.

## మారీచుఁడు కడపటిసారిగా హితము చెప్పఁబూనుట.

* ప్రభుత్వగర్వమున రావణుఁడు తన్నీరీతి నాజ్ఞాపింపఁగా మారీచుఁ డతనింగని కఠినవాక్కులొప్ప నిట్లనియె. రావణా! నీకు నీసంతతికిని మంత్రులకు వినాశమును గల్గింపఁ బూని యేపాపాత్ముఁడు నీ కీయుపాయమును దెలిపెను. నీసుఖము నెవఁడు చూడఁజాలకపోయెను. మృత్యుద్వారమే యనఁదగు నీదుష్కార్యము నీమది కెక్కున ట్లేదుష్టుఁడు తెలిపెను? పౌరు

* ఇయ్యది నలువదొకఁడవసర్గమునఁ గలదు.

షము లేనివా రెవ్వరో రాక్షసులు నీకుం బగవారు కలరు. సందియమిందు లేదు. బలవంతుం డగు శ్రీరామునకుం జిక్కి నీవు నశింపవలయుననియే వారు కోరిరి. కేవలవిరోధి యిట్లు చేయండు చుమీ? ఆవిరోధులలో మిక్కిలి క్షుద్రబుద్ధిగలవాండే యిట్లు చేయును. వాం డెవ్వండో తెలుపుము. నీప్రయత్నమున నీవే నశింపవలయు ననుకోరికచే నీకు నహితమును గోరువాం డెవ్వండో నీకీయాలోచనము చెప్పెను. వానిం దెల్పుము. రావణా! లోకమునకు శాస్త్రమునకును విరుద్ధమగు త్రోవం ద్రొక్కిన నిన్ను మంత్రు లెవ్వరుకాని నివారింపకున్న వారే. ఏల? ఆపం బూనకయున్నందున వారెల్ల వధ్యులే. వారిం జంపవేల? రాజు స్వేచ్ఛాప్రవర్తకుండై దుష్పథములం బ్రవర్తింపం బూనినయెడల సాధుమతు లగుమంత్రు లాతని సర్వథా నిగ్రహింపవలయు. వారేల యాపనికిం బూనరు? జయశీలురలో నీవే యగ్రగణ్యుండవు. రాజు నిర్దోషియై సుగుణశోభితుం డగునేని అతనిమంత్రులకు ధర్మకీర్తులు గలుగు. రాజు దుష్టుండగునేని మంత్రులకు ధర్మకీర్తులు గలుగవు. ఒక్కమంత్రులకే కాదు దుష్టప్రభువుమూలమున జనులు కూడ వ్యసనములపాలే యగుదురు. ధర్మజయములకాధారము ప్రభువే యగును. కావున సర్వథా రాజు నెల్లరును గాపాడవలయును. క్రూరుండుగాని ప్రజాప్రతికూలుండుగాని, అజితేంద్రియుండుకాని, రాజ్యమును బాలింప నర్హుండు కాండు. పాటవశూన్యుం డగుసారథి తోలంగా గుఱ్ఱములు నిమ్నోన్నతప్రదేశముల వేగముగాం బోవుచు నతనితోడను గూలుచందమునం గ్రూరోపాయములం బ్రయోగించుమంత్రులు సమర్థత లేక తమ యాలోచనముల నాలకించు రాజుతోడ నశింతురు.

రాక్షసేశ్వరా! ఈలోకమునందు నీతిమార్గమునందాసక్తిగలిగి ధర్మము నాచరించుసాధువులు పరుల నమ్ముకొని వారల యపరాధములమూలమునఁ దారు సపరివారముగా నశించిరి. మేషములు విరోధియు ఘాతుకస్వభావము గలనక్క పరిపాలనమునకు లోఁబడునేని క్రమముగా నశించురీతిఁ బ్రజలకు విరోధియు దుష్టుఁడు నగురాజు నేలుబడికి లోఁబడినవారు క్షీణింతురు. రాజా! క్రూరుఁడవై విషయలోలుఁడవై యుండు నీవు రాజవు కాఁగా రక్కసులందఱు నశింపకమానరు సుమీ. దైవికముగా నాకీకార్యము నీవిపత్తు గలిగినవి. వలయునని నేను దెచ్చిపెట్టుకొనిన వివి కావు. కాన నాయొక్కనినాశమునకు వగవఁ బనిలేదు. నీవనఁగా దీనిని బుద్ధిపూర్వకముగాఁ దెచ్చిపెట్టుకొన్నవాఁడవు. సబాంధవముగా నీవు నశింతువు కదా. కనుక నిన్నుఁ గూర్చియే దుఃఖింపవలసి యున్నది. శ్రీరాముఁడు నన్నుఁ జంపినపిదప వేగముగా నిన్నుం బొలియఁ జేయును. నీమూలమున నేను శ్రీరామునిచేఁ జచ్చుటంజేసి ధన్యుఁడ నయ్యెదను. రామదర్శనమాత్రమున నేను మృతినొందినట్లే నిశ్చయింపుము. సీత నపహరించినయంత నీవును సపుత్రబాంధవముగా నశింతువు. ఇది యెఱుంగుము. నన్నుం గూడిపోయి యాశ్రమమునుండి సీత నపహరింతువేని నీవిఁక బ్రదికి యుందువనుట కల్ల. నేను నంతియ. లంకమాత్రము నశింపక యుండునా? అదియు నశించును. రాక్షసు లంతియ. నీమేలు గోరియే యింతగా నొక్కి చెప్పుచున్నాఁడను. నామాట మంచిదని యూహింపక యున్నాఁడవు. ఆయుస్సు నశించుకాలమున మృతి సమీపింపఁగాఁ బ్రాణులు శవములే యగును. శవములవలె వారును మిత్రవాక్యములు హితములని యాలకింపరు.

అని యాదరణము విచారము కలుగ మారీచుఁడు రావణునకు హితము చెప్పెను.

మహాశయులారా! దీనితో మారీచునుపదేశము పూర్తి యగును. ఆవల శ్రీరామకార్యము సాగును. ఇందేమేని విశేషములు కలవా యని విమర్శింతము.

"కేనాయ ముపదిష్టస్తే వినాశః పాపకర్మణా,
సపుత్త్రస్య సరాష్ట్రస్య సామాత్యస్య నిశాచర. 2
కస్త్వయా సుఖినా రాజన్నాభినందతి పాపకృత్,
కేనేదముపదిష్టం తే మృత్యుద్వారముపాయతః." 3

అని మూలము. మారీచుఁడు రావణుని నాశ మెఱింగెనని యీమూలము తెల్పుచున్నది. సాధువులతోడి విరోధము సపుత్త్రమంత్రిబాంధవరాష్ట్రముగ నశింపఁజేయునని యతఁడు నమ్మెను. క్రూరరాక్షసునకీ యూహాలు కల్గునా? పూర్వకర్మవశమున నతని కాజాతియందుఁ బుట్టుక కల్గెను గాని యా కర్మ ఫలానుభవము పూర్తియయ్యెను. సత్కర్మఫలానుభవకాలము సమీపించెను. కావుననే యిట్టి హితోపదేశ మొనరించెను.

"సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణమంతఃకరణప్రవృత్తయః."

అనుసూక్తి వ్యర్థము కాదు కదా. దుష్టబుద్ధి యగువాఁడును సత్కర్మఫలము లనుభవించుకాలము దాఁపునకు రాఁగా సాధుమతియే యగును. దీనింబట్టి లోకమున దుష్టులే లేరనియు, నెల్లవారును దుష్కర్మఫలానుభవకాలమున దుష్టులే యనఁబడుదురనియు, వారే సత్కర్మానుభవకాలమున సజ్జను లనఁబడుదురనియు మనము నమ్మవచ్చును.

"అమంత్ర మక్షరం నాస్తి నాస్తి మూలమనౌషధం,
అయోగ్యః పురుషో నాస్తి యోజక స్తత్ర దుర్లభః."

అను నీతిశాస్త్రవాక్యము సిద్ధాంతమే యగును. దుష్కార్యములుచేయువారు సర్వకాలము దుష్టు లనఁబడరు. వారే మంచికార్యము లొనరించి సజ్జనులగుదురు. దీనింబట్టి దుష్టత్వ సాధుత్వములు కర్మాధీనములే యనఁదగును.

"న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః." ౫

అను నీగీతాశాస్త్రవాక్యము పైని వ్రాసినభావమునే సూచించెడిని. ఇది సామాన్యసిద్ధాంతము. విశేషసిద్ధాంతము కలదు.

"న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే. ౧౪
ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతం." ౧౫
అధ్యా-౪.

అనునవియే విశేషసిద్ధాంతము. ఈఘట్టమున నీరెండవది పనికిరాదు. కర్మసిద్ధాంత మెంత బలవత్తమమో మన కీభాగము తేటపఱచుచున్నది. ఒక్కకార్యము నెఱవేఱుటకై యెందఱినో ప్రోత్సహించుచు నందఱిమూలమున నాయొక్కమహాకార్యమును గర్మము సాధించును. ఆకార్యమున మేలో కీడో యనుభవింపఁ గలవారలంద ఱొక్కప్రక్కనఁ జేరుదురు. ఇరుపక్షములుగా నుండఁగా నొకపక్షమునకు మేలు వేఱొక పక్షమునకు హానిరూప మగులాభము కలుగును. లోకులొకపక్షమువారి నాక్షేపింతురు. కాని యాపక్షమే లేకున్నఁ

బాపకర్మములు చేయరాదన్న నీతి కుదాహరణము దొరకక పోవును. కనుకనే సాధువు లేపక్షమును దూషింపరు. మారీచాదులు లేకున్న ధర్మస్థాపనము చేయుటకు నధర్మము నశింపఁ జేయుటకు భగవంతున కవకాశ మెక్కడిది? కర్మబద్ధ మీ ప్రపంచమనుటయే సిద్ధాంతము.

"అమాత్యైః కామవృత్తో హి రాజా కాపథమాశ్రితః,
నిగ్రాహ్యస్సర్వథా సద్భిర్న నిగ్రాహ్యో నిగృహ్యసే. ౭
ధర్మమర్థం చ కామం చ యశశ్చ జయతాంవర,
స్వామిప్రసాదాత్సచివాః ప్రాప్నువంతి నిశాచర. ౮
విపర్యయే తు తత్సర్వం వ్యర్థం భవతి రావణ,
వ్యసనం స్వామివైగుణ్యాత్ప్రాప్నువంతీతరే జనాః. ౯
రాజమూలో హి ధర్మశ్చ జయశ్చ జయతాంవర,
తస్మాత్సర్వాస్వవస్థాసు రక్షితవ్యా నరాధిపాః. ౧౦
రాజ్యం పాలయితుం శక్యం న తీక్ష్ణేన నిశాచర,
న చాపి ప్రతికూలేన నావినీతేన రాక్షస." ౧౧

అని మూలము. రాజు తనకుఁ దోఁచినట్లు ప్రవర్తింపరాదు. కుమార్గమున నడువరాదు. అట్లు వర్తించురాజును మంత్రులు నిగ్రహింపవలయును. అనఁగా రాజ్యపాలనార్హుఁడవు కావని తొలఁగింపవలయును. ధర్మార్థకామములు యశస్సు ప్రభువుమూలమున సిద్ధించును. నాల్గవపురుషార్థ మగుమోక్షము మాత్రము స్వాయత్తమే. అనఁగా భావమేమి? ధర్మార్థకామము లనుమూఁడును ముక్తికి సాధనములు కావలయు ననియే. దానిని బాధించునవిగా నుండరాదు. ధర్మము నాచరించుట, అర్థము నార్జించుట యనునవి రెండును గామము

నరికట్టవలయును. అపు డది ధర్మార్థయుక్తమగును. దానిచే ముక్తికి సాధనమగుప్రవృత్తి యలవడును. అట్లు గానిచో నెంతశ్రమపడినను ముక్తి కుదురదు. వేదాంతవాక్యపాఠము నిరర్థక మగును. ధర్మార్థకామములు సముచితములు గావలయు నన్న జితేంద్రియుఁడు | కావలయును. అది యోగాభ్యాససాధ్యము. అట్టివానికే ముక్తి కరతలామలకము. అది యభావ మగునే నియ్యది యత్యంతాభావమగుననియే యిందలిసారము. "స్వామివైగుణ్యాత్ ఇతరే జనాః ప్రాప్నువంతి" అనుచో విశేష మేమనఁగా: నడిపించువాఁడు రాజుకదా. అతఁ డవగుణుఁ డయ్యేనేని జనులందఱు నట్టివారలే యగుదురు. "కారణగుణాః కార్యే సంక్రామంతి"యనున్యాయము క్రొత్తది కాదు. కనుకనే

"తమాహు స్సంప్రణేతారం రాజానం సత్యవాదినం,
సమీక్ష్యకారిణం ప్రాజ్ఞం ధర్మకామార్థకోవిదం. ౨౬
తం రాజా ప్రణయన్ సమ్యక్త్రివర్గేణాభివర్ధతే,
కామాత్మా విషమః క్షుద్రో దండేనైవ నిహన్యతే. ౨౭
శుచినా సత్యసంధేన యథాశాస్త్రానుసారిణా,
ప్రణేతుం శక్యతే దండస్సుసహాయేన ధీమతా. ౩౧
స్వే స్వే ధర్మే నివిష్టానాం సర్వేషామనుపూర్వశః,
వర్ణానా మాశ్రమాణాం చ రాజా సృష్టోఽభిరక్షితా. ౩౫
ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠే ద్దివానిశం,
జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః. ౪౪
మౌలాన్ శాస్త్రవిదశ్శూరాన్ లబ్ధలక్షాన్ కులోద్భవాన్,
సచివాన్ సప్తచాష్టౌ వా ప్రకుర్వీత పరీక్షితాన్. ౫౪

త్రైస్సార్థం చింతయేన్నిత్యం సామాన్యం సంధివిగ్రహం,
స్థానం సముదయం గుప్తిం లబ్ధప్రశమనాని చ. ౧౬
నిత్యం తస్మిన్ సమాశ్వస్తః సర్వకర్మాణి నిక్షిపేత్.
తేన సార్ధం వినిశ్చిత్య తతః కర్మ సమాచరేత్. ౧౭
అమాయయైవ వర్తేత న కథంచన మాయయా,
బుద్ధ్యేతారిప్రయుక్తాం చ మాయాం నిత్యం సుసంవృతః.'' ౧౦౪
మను. ౭-అధ్యా.

అను నీమనుస్మృతివాక్యములఁ గలభావమే రామాయణ మునఁ దెలియనగు. అనఁగా రాజప్రవర్తనము ననుసరించియే ప్రజలప్రవర్తన ముండుననియు, నట్లగుటం జేసి మంత్రులందఱు రాజు దుష్ప్రవర్తకుఁడు గాకయుండఁ జూచుచుండవలయు ననియు, సకలధర్మములు శాస్త్రప్రతిపాదితములుగనే యుండ వలయుననియు, మానవబుద్ధి యల్పముగాన నుదారబుద్ధు లగు మహాత్ముల వాక్కులభావమును దెలుపు శాస్త్రములరీతి నాలో చింపవలయుననియు, మహాత్ములనఁగా

"లౌకికానాం హి సాధూనా మర్థం వాగనువర్తతే,
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి."

యన్నయట్లు సిద్ధవాక్కులు గలవారలే యనియుఁ, గార్యాను కూలముగా మాటలాడువారు సామాన్యులే కాని మహాత్ము లేకాలమునను గాఁజాలరనియు భావము. అట్టిమంత్రులు నీకుఁ గలిగియుండియు నిట్టి దురాలోచనము చేయు నిన్నేల యరికట్ట కున్నవారో తెలియఁజాలకున్నాఁడనని మారీచుఁ డాక్షేపించె నని ప్రకృతకథానుబంధము. ఈభాగము వేఱొకవిషయమును గూడ సూచించుచున్నది. రాజప్రవృత్తి ననుసరించి ప్రజల

ప్రవర్తనము కుదురునని కదా యిందుఁ జెప్పఁబడినది. ఇష్టదేవతాస్వభావమే ఉపాసకున కలవడును. మహోగ్రప్రకృతి కలుగునట్లుగా దేవతను భావించి యుపాసించిన నట్టిప్రకృతియే సాధకున కలవడును. శ్రీరాము నుపాసించువారు "క్రోధదుర్నిరీక్ష్యుఁడై రావణసంహారముచేయ నుద్యమించు వీరరాముఁడు నాకార్యము నెఱవేర్పుఁగాక" అనునర్థముగల ధ్యానశ్లోకము నేర్చుకొని యాయర్థమునకుఁ దగినట్లున్న రూపముననే రాముని ధ్యానించి మంత్రజపముచేసిన భ్రమరకీటన్యాయము ననుసరించి యాసాధకునిచిత్తవృత్తియు రౌద్రమగును. కావుననే ఫలాభిసంధిరహితముగా నుపాసింపవలయునని పెద్దలు శాసించిరి.

"త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః." ౨౦

అని భగవంతుఁడు గీతాశాస్త్రమునందుఁ దెలిపెను. ఫలము గోరనపు డేరూపమైనను శాంతమే యగుచు, భావనయే కార్యకారిణి యగుఁగదా. కనుక నుపాసకుఁడు తపఃఫలమును భగవదర్పణముచేయుచు భగవత్ప్రసాదసిద్ధికొఱకని సంకల్పించిన యెడలఁ దప్పక యది ఫలించును. మఱియుఁ దద్దేవతాభిన్నమేదియు లేదనియు(అనఁగాఁ బరాత్పరుఁ డారూపమున వెలసినట్లు భావించుచునని సారము.) నుపాసింపవలయు. సర్వాంతర్యామి యగుమహాతత్త్వమే యుపాసకుని భావనాబలమున "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా" అన్న ప్రమాణము ననుసరించి యాతని కారూపముఁనే ధరించి ప్రత్యక్ష మగును. కావున సాధకుఁడు భేదబుద్ధిని మాని యుపాసింపవలయు ననునభిప్రాయ మీభాగమునుండి మనము

గ్రహింపవచ్చును. గ్రహింపవలయునని సిద్ధాంతము కాద నియుఁ గొందఱు గ్రహింపవచ్చును.

"స్వామినా ప్రతికూలేన ప్రజాస్తీక్ష్ణేన రావణ,
రక్ష్యమాణా న వర్ధంతే మేషా గోమాయునా యథా. ౧౪
అవశ్యం వినశిష్యంతి సర్వే రావణ రాక్షసాః,
యేషాం త్వం కర్కశో రాజా దుర్బుద్ధి రజితేంద్రియః. ౧౫
తదిదం కాకతాళీయం ఘోరమాసాదితం మయా,
అత్రైవ శోచనీయ స్త్వం ససైన్యో వినశిష్యసి. ౧౬
మాం నిహత్య తు రామశ్చ న చిరాత్త్వాం వధిష్యతి,
అనేన కృతకృత్యోఽస్మి మ్రియేయమరిణా హతః. ౧౭
దర్శనాదేవ రామస్య హతం మా ముపధారయ,
ఆత్మానం చ హతం విద్ధి హృత్వా సీతాం సబాంధవం. ౧౮
ఆనయిష్యసి చేత్సీతా మాశ్రమాత్సహితో మయా,
నైవ త్వమసి నాహం చ నైవ లంకా న రాక్షసాః." ౧౯

అని మూలము. "యథా మేషా గోమాయునా రక్ష్యమాణా న వర్ధంతే ప్రతికూలేన స్వామినా తథా ప్రజా న వర్ధంతే" అని యన్వయము. క్రూరుఁడు న్యాయప్రతికూలుఁడు నగు రాజు రక్షింపఁగా నుండు ప్రజలు నశింతురు. నక్క రక్షించునదిగా నుండఁగా దాని యేలుబడిలో నుండు మేకలు నశించునట్లు, మేషములఁ జంపుట నక్కకు సహజగుణమని ప్రసిద్ధి. ఇట నక్క యనఁగా "తోఁడేలు" అని గ్రహించుట మంచిది. తోఁడేలును పెద్దనక్క యనుట ఆబాలగోపాలవిదితము. రెండు నొక జాతికిం జేరినవియే. నీవు రాజవుగా నుండఁగా రాక్షసులు నశింపఁగలరని మారీచుఁడు రావణునకుం దెల్పె

ననుట ప్రకృతకథార్థము. ఇది గురుశిష్యసంబంధమును సూచించుచున్నది. తీక్ష్ణేన = శిష్యద్రవ్యాపహరణమున నిర్దయుఁడై, ప్రతికూలేన = గురుధర్మప్రతికూలుఁడైన, స్వామినా = గురువుచేత, రక్ష్యమాణాః = సంసారసాగరమునుండి యుద్ధరింతుననువాగ్దానముచే మాత్రము కాపాడఁబడు, ప్రజాః=శిష్యులు, న వర్ధంతే = వృద్ధినొందరు. అనఁగా మేలుపొందరు. అని యర్థము. వేషధారులుకొందఱు గురువులమగుదుమని యాచించుచుఁ బామరులకు మంత్రోపదేశము చేయుచు భగవత్సేవకన్న గురుసేవయే ప్రధానమని బోధించుచు, భగవంతుఁడు కర్మమునఁ బడఁద్రోయుననియు, నాచార్యులు కర్మమునుండి యుద్ధరించుననియుఁ దెలివిమాలినపలుకులు తెలుపుచు, సర్వస్వము గుర్వధీనముచేసినఁగాని తరించుమార్గము దొరకదని నొక్కి చెప్పుచు, శిష్యులుగాఁజేరిన పామరుల వంచించి ధనము నపహరించుచుందురు. వారి యధీనమున నున్న శిష్యులు నశింపక యెట్లు కృతార్థు లగుదురు? శిష్యద్రవ్యముగ్రహించి యుపదేశించినవాఁడు పిశాచమగునని శాస్త్రములు ఘోషించెడిని. పాత్రుఁడగు శిష్యుని గోరి సంపాదించి యుపదేశింపవలయునని కదా శాస్త్రమర్యాద. దానినివదలి ధనార్జనోపాయములు వెదకుచుఁ గొందఱఁ దమవంటివంచకులను శిష్యులనుగాఁ గూర్చుకొని తనమాహాత్మ్యమును వా రితరులకుఁ దెలుపుచుండఁగాఁ బామరులు మోసపోయి శిష్యులుగాఁ జేరఁగా నెన్నియోవేరుల ధర్మములు చేయుచున్నట్లు నటించి కొలదిభాగము వంచకశిష్యుల కొసంగి మిగిలినదానిని గ్రహించి బంధువులకు రహస్యముగా నొసంగుచుండు నీచాతినీచులు గురువులుగా నుండఁ బామరు లేల నశింపరు? ముక్తి దొరకదు గాని ధన

విముక్తి తప్పదు. అను నీతి నీభాగము సూచించుచున్నది. "దుర్బుద్ధి రజితేంద్రియః, త్వం కర్కశో రాజా" అని మారీచుఁ డనెను. ఈయర్థమునే మనుస్మృతియుఁ దెలుపుచున్నది

"జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః."

అని. రాజు జితేంద్రియుఁడు కావలయును. కుబుద్ధి కారాదనఁగా భావమేమి? అతనిగుణములు భ్రమరకీటన్యాయము ననుసరించి ప్రజలయందు సంక్రమించుననియే కదా. అట్లే గురువుసద్గుణములు శిష్యులయందు సంక్రమించునని మన మూహించుట పొరపాటగునా? జితేంద్రియుఁడు కానివాఁడు గురువు కానేరఁడని యీక్రిందిప్రమాణములు తెలుపుచున్నవి.

"శ్రీగురుః పరమేశాని శుద్ధవేషో మనోహరః.
సర్వలక్షణసంపన్న స్సర్వావయవశోభితః,
అగ్రగణ్యో గభీరశ్చ పాత్రాపాత్రవిశేషవిత్.
శివవిష్ణుసమస్సాధుర్న చ దర్శనదూషకః,
నిత్యే నైమిత్తికే కామ్యే రతః కర్తవ్యానిందితే.
యదృచ్ఛాలాభసంతుష్టో గుణదోషవిభేదకః,
ఇత్యాదిలక్షణోపేతశ్శ్రీగురుః కథితః ప్రియే."

కుళార్ణవము.

నింద్యగురుమాహ:—

"శ్విత్రీ చైవ గళత్కుష్ఠీ నేత్రరోగీ చ వామనః,
కునఖీ శ్యావదంతశ్చ స్త్రీజితో వ్యాధికాంగకః.

హీనాంగః కపటీ రోగీ బహ్వాశీ బహుజల్పకః,
ఏతైర్దోషైర్విహీనో యస్స గురుశ్శిష్యసమ్మతః."

ప్రియాసారము.

"గురుర్గృహస్థ ఏవైకో న కదాచిత్పతిర్గురుః,"

కేవలకామిపరోఽయం నియమః.

తథా చ సూతసంహితాయామ్:—

"ఉత్తమః పంచధా ప్రోక్తో గురుర్బ్రహ్మ సువేదిభిః.
బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ భిక్షుకః,
అతివర్ణాశ్రమీ చేతి క్రమాత్ శ్రేష్ఠో విచక్షణః."

జ్ఞానార్ణవే:—

"నిందితస్తు పితుర్మంత్రస్తథా మాతామహస్య చ,
సోదరస్య కనిష్ఠస్య వైరిపక్షాశ్రితస్య చ."

నారదతంత్రే:—

"నాస్తికాన్ భిన్నమర్యాదాన్ కృతఘ్నాన్ వేదనిందకాన్,
మంత్రాక్షరోపదేశే తు దూరతః పరివర్జయేత్."

అని గురుపరీక్ష చెప్పఁబడినది. పైనవ్రాసిన గురుదోషము లిందు "కపటీ" అనుపదముచేఁ దెల్పఁబడినవి. 'శివ విష్ణు సమః' అనుటంజేసి దేవతాంతరదూషకులు పనికిరారని తేలెడిఁగదా. ఇట్టివా రాచార్యులు కాఁదగరు. అనాచార్యులే యగుదురు. ఈవిషయమంతయు రామాయణమునందలి యీభాగము సూచించుచున్నది. రావణా! నన్నుఁజంపి రామమూర్తి సత్వరముగ నిన్నుం జంపును. నీకుఁ బగవాఁడగు శ్రీరామునిచే నేను వధింపఁబడుటచేఁ గృతకృత్యుఁడ నగుదును. నీకుఁ బగవాఁడనఁగా నిన్ను వధింపనే యవతరించినవాఁడని యర్థము.

తొలుత నన్నుఁ దరువాత నిన్నుఁ జంపును. నీచేతఁ జచ్చుట కంటె నాకు రామునిచేఁ గలుగుమృతి శ్రేష్ఠము. అనఁగా విముక్తిదమని భావము. మారీచుఁ డవివేకియే యైన నిట్లు పలుకునా? స్వకర్మప్రోత్సాహితుఁడై మారీచుఁడు ముక్తుఁడు కాఁబోవుచున్నవాఁడు. కాన శ్రీరామునిచేఁ దనకు మృతి గలుగనున్నదనియు, నామూలమునఁ దనకీజన్మము నశించి పునరావృత్తిరహితశాశ్వతానందానుభవరూపముక్తి దొరకుననియు నమ్మెను. రక్కసునియూహాలే యతనికుండిన దుఃఖింపఁడా? 'తవారిణా హతః.' అనుటంజేసి రావణుని శత్రువయియే వధింతునన్న భగవద్వాక్యము నామారీచుఁడు కర్మప్రోత్సాహమున స్మరించెనని మన మెఱుంగవలయు. దీనిచే భగవంతునకు విరోధిలేఁడని స్పష్టమగును. "న మే ద్వేష్యోఽస్తి న ప్రియః" అనునూక్తి భగవంతుఁడే తెలిపెంగదా. శత్రుత్వప్రదర్శనము నాటకమనియే మనము నమ్మవలయును. శాపవశమునఁ బరితపించుభక్తు నుద్ధరించుమార్గ మదియే కాన, లేనివిరోధము గలిగినట్లు నటించెననియే మనము విశ్వసింపవలయును. "దర్శనాదేవ రామస్య హతంమా ముపధారయ."అనఁగా నాకర్మము శాశ్వతానందసుఖప్రదానోన్ముఖము గానున్నది. కాన నింకెంతయో కాలము నిలువఁబోను. రామచంద్రదర్శన మాత్రముననే అనఁగా నేకాంతదర్శనమున నని భావము. సీతాలక్ష్మణులు లేనితావున భగవంతుని గన్నులారఁగాంచుచు శరీరము విడుతునని సారము.

"అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం,
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః. గీ

అను నీ గీతావాక్యమునఁ గలయర్థ మిదియే కదా. స్మరించుచుఁ బ్రాణములు వదలిన నన్నుఁ జేరునని పరమేశ్వరుఁడు పలికెఁ గదా. స్మరించుచుఁ బ్రాణములు వదలిన ముక్తి గలుగును. ఇఁకఁ గన్నులారఁ గాంచుచు భగవంతుఁ డనుభావమున శరీరమును వదలినఁ జెప్పవలసిన దేమి? 'ఆత్మానం చ హతం విద్ధి హృత్వా సీతాం స బాంధవం' అనుచో భావమేమి? సీత నపహరించినంతనే నిన్నుఁగూడ మృతినొందినవానిగనే నిశ్చయించుకొనుము. నీవొక్కఁడవే కాదు. సబాంధవముగా నని మారీచుఁడు పల్కెను. భావిఫలములు మారీచునోటనుండి కర్మమే పలికించెనని మన మెఱుంగవలయును.

"నివార్యమాణస్తు మయా హితైషిణా
న మృష్యసే వాక్యమిదం నిశాచర,
పరేతకల్పాహి గతాయుషో నరాః
హితం న గృహ్ణంతి సుహృద్భిరీరితం." ౨౦

అని మూలము. నీమేలు గోరి యెంతేదూర ముపదేశించినను నీ వంగీకరింపకున్నాఁడవు కదా. మృతినొందఁ దగుమానవులు మిత్రవాక్యములను గూడ నాలకింపరు. అని మారీచునిచే వాల్మీకి పలికించి కర్మసిద్ధాంతమును దృఢపఱచెను.

"యద్యహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి."

అను భగవద్గీతావాక్యార్థమునే యీ రామాయణభాగము తెల్పుచున్నది. కర్మ మెంతవారినైన నిర్బంధించి వారిమూల

మున నాకార్యమును సాధించుననియే కదా యీభాగమునం గలసారము. అట్టటి మిత్రవాక్యము కూడ నహితముగాం దోఁచును. అనుటచే మానవులు కర్మబద్ధులు నస్వతంత్రులు ననియే యిందలివిషయము.

"దీపనిర్వాణగంధం చ సుహృద్వాక్యమరుంధతీం,
న జిఘ్రంతి న శృణ్వంతి న పశ్యంతి గతాయుషః."

అను నీతివాక్యము నీయర్థమునే తెలుపుచున్నది. ఇట్టులీ మారీచహితోపదేశము కర్మసిద్ధాంతమును శ్రీరామమాహాత్మ్యమును దెలుపుచున్నది. ఈవిషయమున నధ్యాత్మ రామాయణమున విశేషమేదియు లేదు. ముందే యందలివిశేషము వ్రాయఁబడినది కదా. తరువాతి శ్రీరామచరిత్రమును బఠింతము రండు.

రావణమారీచులు రామాశ్రమమున కరుగుట.

* అంత మారీచుఁడు రావణునకు భయపడి వగచుచుం బోవుదము లెమ్ము. అని ధనుర్బాణఖడ్గములనంది నన్ను వధింప బాణమును దీసిన శ్రీరామునికంట నేనుబడుటయే యాలస్యము. ఆతఁడు శరవిమోచనము చేయ నక్కఱలేదు. చూడఁగనే నాప్రాణములు పోవును జుమీ. శ్రీరామునిమ్రోలం బౌరుషమును గనఁబఱచి యసువులతో మరలివచ్చినవాం డుండఁడు. నీవే యమదండహతుఁడవై చావ సిద్ధముగ నున్నవాఁడవు. నీవలె నేనొక్కఁడ నున్నాఁడను. దుర్బుద్ధి నీకిట్లు కలుగ నేనేమి చేయఁజాలుదును? ఇదిగో ప్రయాణము చేయుచున్నాఁడను. నీకు భద్రమగుఁగాక అని పలికెను. ఆమాటలకు

* ఇయ్యది నలువదిరెండవసర్గమునం గలదు.

